

ఇందులో:




17

15–6–49


# జనత



మార్క్సిస్టు సిద్ధాంత పక్షపత్రిక

సంచిక 17 | 15—6—1949 | వెల: 8 అణాలు

# కేంద్రప్రభుత్వ బడ్జెట్

## పెట్టుబడిదారీ ఆర్థిక సంక్షోభానికి ప్రతిబింబం

### I

గత సంవత్సరం ఆర్థిక సంక్షోభం మరింత తీవ్రతరమయింది. ఆర్థిక మాంద్యం ముంచుకురావడంవల్ల కార్మిక వర్గ జీవనస్థాయిపై దాడులు జరపడం, ఆ దాడులను కార్మికవర్గం అతితీవ్రంగా ప్రతిఘటించడం, భూస్వాముల, గ్రామీణ పెట్టుబడిదారుల పట్టపగటి దోపిడికి వ్యతిరేకంగా వ్యవసాయదారులు తిరుగుబాట్లు సాగించడం జరిగింది. రానున్న సంవత్సరం ఇంతకంటె ఆర్థిక మాంద్యం ఇంకా తీవ్రతరం కాబోతూ ఉంది. కార్మికులపై, రైతులపై దాడులు ఇంకా తీవ్రతరం కాబోతున్నాయి. సంఘర్షణలు ఇతోధికంగా చెలరేగుతాయి. ఆసియాఖండంలో పొంగి పొరలుతూఉన్న విప్లవ ప్రవాహం ఇంకా విస్తృతం అవుతుంది. తదితర పెట్టుబడిదారీ దేశాల్లోలాగే ఇండియాలోకూడా బూర్జువావర్గం తన నిర్బంధ యంత్రాన్ని దమన యంత్రాన్ని ఇంకా కట్టుదిట్టం చేసుకోడం కోసం పిచ్చెత్తిన కుక్కలాగా ఇంకా తీవ్రతరంగా ప్రయత్నిస్తుంది.

ఇండియా పార్లమెంటులో ఇటీవల ప్రతిపాదించబడిన బడ్జెట్ అంచనాలు ఈ రానున్న ఆర్థిక మహాసంక్షోభాన్నే ప్రతిబింబిస్తున్నాయి. ఉవ్వెత్తుగా పొంగివచ్చే సంక్షోభ తాకిడినుంచి తట్టుకోడానికి పెట్టుబడిదారీ ప్రభుత్వాలు ఏవిధంగా తమ బడ్జెట్ డబ్బును ఉపయోగించుకుంటారో, సంక్షోభ భారాన్ని సాధా

రణప్రజల నెత్తిపై ఏవిధంగా మోవుతాయో ఆ అంచనాలే సూచిస్తాయి.

రివిన్యూ బడ్జెట్‌లో ప్రధానమైన ఖర్చు జాబితాలవైపు ఒకసారి మనదృష్టి ప్రసరిస్తేచాలు. వాటిబండారం అంతా బైటబడుతుంది.

(కోట్లలో)

| | 1948-49 | 1949-50 |
|---|---|---|
| 1. రక్షణశాఖ | 155.43 | 157.37 |
| 2. ఋణాలకు | 39.9 | 39.29 |
| 3. ప్రభుత్వనిర్వహణ | 38 | 40 |
| 4. ఆహారధాన్యాదులకు సబ్సిడీ | 31.96 | 32.97 |

1948-49 రివిన్యూబడ్జెట్ మొత్తం ఖర్చులో మిలిటరీఖర్చు నూటికి 47 వంతులయితే 1949-50 బడ్జెట్‌లో అది నూటికి 50 వంతులవరకు పెరిగింది. ఈ విపరీత ఖర్చుకుతోడు 'రక్షణ' పేరుతో ఉన్న కేపిటల్ బడ్జెట్ నుంచి 1948-49 లో 9 కోట్ల 91 లక్షల రూపాయలూ, 1949-50 లో 3 కోట్ల 20 లక్షల రూపాయలూ కలపవలసి ఉంటుంది.

అంటే మొత్తంమీద దీన్నే ఇంకా తేలికగా అర్థమయ్యేభాషలో చెప్పాలంటే 1948-49 లో రోజు 1కి 67.4 లక్షలు చొప్పున మిలిటరీకోసం ఖర్చు పెట్టడం జరిగింది. 1949-50 లో మిలటరీ కార్యకలాపాలకోసం రోజు 1కి 43.8 చొప్పున ఖర్చు పెట్టబడుతుంది.

1938-39 లో రక్షణశాఖకోసం మొత్తం 47 కోట్ల రూపాయలు ఖర్చు అవుతూఉండేది. యుద్ధం అయిపోయి నాలుగుసంవత్సరాలు గడచిన తర్వాత నేడు 1949-50 లో యుద్ధానికిపూర్వం శాంతిసంవత్సరంకంటె 3½ రెట్లు ఎక్కువగా ఖర్చుపెడుతూఉంది. 1948-49 లో 5 రెట్లుకంటె పైగా ఖర్చుపెట్టడం జరిగింది. ఇప్పుడిచ్చిన ఈ లెక్కలనుబట్టి చూస్తే మిలిటరీవ్యయం ఎంతవిపరీతంగా ఉందో పూర్తిగా బోధపడదు. ఎందుకంటే 1938-39 సంవత్సరపు లెక్కలు అవిభక్త భారతదేశానికి సంబంధించినవి. 1938-39లో భారతరాజధానుల్లోఉన్న మొత్తం జనాభా 28 కోట్ల 60 లక్షలు అయితే 1947-48లో 24 కోట్ల 60 లక్షల మాత్రమేఉంది. (ఈస్టర్న్ ఎకానమిస్టు) ఈ లెక్కల ప్రకారం మనిషి 1కి మిలిటరీ వ్యయం

1938-39 లో రు 1-10-3
1948-49 లో ,, 10- 0-0
1949-50 లో ,, 6-8- 0

అంటే 1938-39 తో పోల్చిచూస్తే 1949-50 లో మనిషి 1కి మిలటరీవ్యయం దాదాపు 6 రెట్లు పెరిగిందన్నమాట.

బలవత్తరమైన సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా దురాక్రమణలో ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులతో షరీక్ కావడానికీ, ఆగ్నేయ ఆసియాలో విజృంభిస్తూఉన్న ప్రజా పోరాటాలను అణచడంలో సహాయం చేయడానికీ, స్వదేశంలో ప్రజాస్వామికోద్యమాన్ని అణచివేయడానికీ, ఇండియా పాలకవర్గాలు అతితీవ్రంగా ప్రయత్నిస్తున్నాయని ఈ అతి విపరీతమైన మిలటరీ వ్యయమే చెప్పక చెప్తుంది.

ప్రభుత్వాధికారం చేతులు మారిన తర్వాత పాకిస్తాన్ ప్రమాదం, కాశ్మీరు యుద్ధం వగైరాలపేరుతో ఈ విపరీతమైన మిలటరీ వ్యయాన్ని సమర్థించేవాళ్లు. కాని ఈ మిలటరీ వ్యయంలో ఎక్కువ భాగం ట్రేడ్‌యూనియన్ పోరాటా

లనూ, రైతుపోరాటాలనూ అణచడానికే వినియోగించబడింది. తెలంగాణాలో కమ్యూనిస్టుపార్టీ ఆధ్వర్యాన జరిగే ప్రజా స్వాతంత్ర్యోద్యమాన్ని, తెలంగాణా గ్రామాల్లో ఏర్పడిన ప్రజా ప్రభుత్వాలనూ అణచివేయడమే హైదరాబాద్ సంస్థానంలో ఇండియా సైన్యం నిర్వహించవలసిన ప్రధాన కర్తవ్యమని నిర్వచింపబడింది. కమ్యూనిస్టులచే నడపబడే రైతు ఉద్యమాలను అణచివేయడంకోసమే ఆంధ్ర, మలబార్ జిల్లాలకు సైన్యాలు పంపబడుతున్నాయి. రైల్వేసమ్మెను అతి దారుణంగా అణచివేయడానికి సైనిక దళాలు నియోగించబడ్డాయి. 1948-49సంవత్సరంలో అయిన 246 కోట్ల మిలిటరీ వ్యయాన్ని తమ బానిసబంధనాలను ఇంకా బిగించుకోడం కోసమే బానిసల నెత్తిపై రోజుకు 67.4 లక్షలరూపాయల చొప్పున రుద్దబడింది.

బలవత్తరమైన సామ్రాజ్యవాద దేశాల నుంచి మన దేశాన్ని రక్షించుకోవాలనే సాకుజూపి ప్రజలను మభ్యపరచి విపరీతమైన తన మిలటరీ వ్యయాన్ని ప్రభుత్వం సమర్థించుకోజూస్తూ ఉంది. సామ్రాజ్యవాదులు విధించిన షరతులన్నింటికీ కిమ్మనకుండా నేటి ఇండియా ప్రభుత్వం తల ఒగ్గింది. కాశ్మీరులో సామ్రాజ్యవాదులు పెట్టిన షరతులన్నింటినీ శిరసావహించింది. సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా ఆగ్నేయ ఆసియాలోకూడా అట్లాంటిక్ సంధిని పోలిన ఒక ప్రాదేశిక మిలటరీ కూటమిని నిర్మించేందుకు కావలసిన ప్లానులన్నిటినీ తయారుచేస్తూ ఉంది. "వినాశకరమైన మిలటరీ వ్యయాన్ని" భారతదేశం భరించలేదు అనే సాకుతోనే యీ తతంగమంతా జరుగుతూ ఉంది. ఈ విధముగా విపరీతవ్యయం చేయకుండా భారతదేశం సైనికంగా స్వయంపోషకంగాఉండజాలదని సాకు చూపబడుతూ ఉంది.

దురాక్రమణకోసం కాలుదువ్వే సామ్రాజ్యవాదదేశాలతో ఇండియా ప్రభుత్వము పూర్తిగా షరీక్ కావడాన్ని 'ఆర్థిక సౌకర్యం' అనే పేరుతో ఒకవైపు సమర్థించుకుంటూనే మరోవైపు ప్రజాశక్తుల నణచడానికీ సోవియట్ వ్యతిరేక యుద్ధంలో వంటచెరుకుగా ఉపయోగించడానికీ సాయుధ సైనికుల సంఖ్యను తగ్గించకుండానే ఉంచడానికి పాటుపడుతూ ఉంది.

ఈ రెండు నాటకాల వ్యవహారం 1949 మార్చి 1వ తేదీన జాన్‌మత్తాయి ఇచ్చిన బడ్జెట్ ప్రసంగంలో స్పష్టముగా ద్యోతకమవుతోంది. గత సంవత్సరంలో సైనికులసంఖ్య ఎంత ఉందో వచ్చే సంవత్సరంకూడా అంతే ఉంటుంది అని జాన్‌మత్తాయి స్పష్టంగా ప్రకటించాడు. సైనికులను తగ్గించడంవల్ల అనేక కష్టాల నెదుర్కోవలసి వస్తుందని చెప్పాడు. 'ప్రస్తుతం ఊహించరాని కొన్ని కారణాంతరాలచేత' శాంతిస్థాపన ఆశలు నిరాశలైతే 'ప్రస్తుతం ప్రతిపాదించిన సూత్రాలనుకూడా ఉల్లంఘించడం అవసరము కావచ్చు'ననికూడా ఆయన హెచ్చరించాడు. ఆంగ్లో-అమెరికా సామ్రాజ్యవాదులు ఇండియాలోని తమ వాటాదార్లకు యుద్ధంకోసం ఇంకా ఎక్కువగా విమానాలు, ఓడలు వగైరాలు ఇవ్వడం అవసరం అని భావించడంలేదు. కాబట్టి ఈదఫ్మాలా మిలటరీ వ్యయంలో తగ్గించగలిగింది ఒక్క పెట్టుబడి (కేపిటల్ ఔట్‌లే) మాత్రమే.

ఆహార ధాన్యాదుల సబ్సిడీల కోసం వెచ్చించే విపరీత వ్యయంకూడా పెట్టుబడిదారీవిధాన తీవ్ర సంక్షోభ ఫలితమే. ఫ్యూడల్ దోపిడినుంచీ, పెట్టుబడిదారీ దోపిడీనుంచి రైతాంగాన్ని విముక్తిచేయ నిరాకరించడం, దేశమంతటా విజృంభించే రైతుపోరాటాలను అణచివేయడం, అసంతృప్తి ఇంకా బాగా వ్యాపించి ఉన్న చోట కొద్దిపాటి అంతర్యుద్ధస్థాయిలో నిర్బంధ విధానాన్ని కొనసాగించడం- వీటన్నిటి ఫలితంగా పెట్టుబడిదారీ ప్రభుత్వం ఆహారకొరతనూ, ఆహారోత్పత్తి కొరతనూ తీవ్రంగా ఎదుర్కొంటోంది. అమెరికా కెనడా దేశాల్లోని ఆహారగుత్త పెట్టుబడిదారులు నిర్ణయించిన ధరలకు దాసోహం అని పెద్ద స్కేలులో ఆహారధాన్యాదులను దిగుమతి చేసుకుంది. (ప్రపంచ 'సేచ్ఛా' ధరలకు లేక అంతరంగిక ధరలకు ఈ ధరలు ఎంతో మిక్కుటంగా ఉన్నాయి.)

ఈ భారాన్నంతా కార్మికుల భుజస్కంధాలపై మోపడానికి ప్రభుత్వం పదేపదే ప్రయత్నించింది. కార్మికులు పొందుతూఉన్న చౌకధాన్య డిపోల సదుపాయాన్నీ, కరువుభత్యాన్నీ తగ్గించివేసి ప్రభుత్వం అతి నిరంకుశంగా ప్రవర్తించింది. ఆహారధాన్యాదులపై కంట్రోలు పూర్తిగా ఎత్తివేయబడింది. మళ్ళీ ఒక బూటకపు కంట్రోలు అమలుపరచడం జరిగింది. ఈ ప్రభుత్వ నిరంకుశ చర్యలన్నింటిని కార్మికవర్గం ఎదిరించి వీరోచితంగా ప్రతిఘటించింది. ధాన్యపు నిల్వలను స్వాధీనం చేసుకోడంవరకు బస్తీలల్లో తిరుగుబాట్లువచ్చే దశవరకు ఉద్యమం విజృంభించింది. వీటన్నిటి ఫలితంగా టన్నుకు వందరూపాయల చొప్పున ఆహార ధాన్యాదుల అమ్మకానికి సబ్సిడీ ఇవ్వడానికి ప్రభుత్వం సమ్మతించవలసి వచ్చింది.

రివిన్యూ బడ్జెట్‌లో ప్రభుత్వ నిర్వహణకోసం, పారిశ్రామికాభివృద్ధికోసం అనే శీర్షికలక్రింద ఖర్చు జాబితాలోఉన్న తదితర ప్రధాన విషయాలన్నీ వెనకబడ్డ ప్రజలను మధ్యపరచడానికీ, పెట్టుబడిదారీ ప్రభుత్వం అనే ఏజన్సీద్వారా ప్రజలను కొల్లగొట్టే దోపిడీలో కొంతభాగం పెట్టి పెట్టుబడిదారీ పరిపాలనకు అండగా ఉంటూ తమ చెప్పుచేతల్లో మెలగే ఉన్నత వర్గానికి చెందిన సైన్యాన్ని ఇంకా కట్టుదిట్టంగా నిర్మించడానికీ ఉద్దేశించబడినవి మాత్రమే.

పైనుదహరించిన పట్టిక ప్రకారం సాధారణ ప్రభుత్వ నిర్వహణకోసం (జనరల్ అడ్మినిస్ట్రేషన్) 1948-49 లో 88 కోట్ల రూపాయలు ఖర్చుపెడితే 1949-50 లో 40 కోట్లరూపాయలు ఖర్చుపెట్టబడుతున్నాయి. ప్రభుత్వ నిర్వహణకోసం ఇదివరకెన్నడూ - అవిభక్త భారతదేశంలో కూడా ఇంతమొత్తాన్ని వెచ్చించడం జరగలేదు. ఇండియాకూ పాకిస్తాన్‌కూ కలిపి 1939లో మొత్తం అయిన ఖర్చుకంటె ఈ ఖర్చు నాలుగు రెట్లు జాస్తీగాఉంది. అంటే అసలు నిజమైన ఖర్చు 4 రెట్లకంటెకూడా ఇంకా ఎంతో అధికమన్నమాట.

ప్రస్తుత సంక్షోభ పరిస్థితుల్లో పెట్టుబడిదారీ ప్రభుత్వాన్ని నిలబెట్టడానికి సామాన్య ప్రభుత్వ యంత్ర నిర్వహణకోసం ఎంతఎక్కువ మొత్తాన్ని ఖర్చుపెట్టవలసి వస్తూఉందో ఈ అంకెలే స్వయంగా సూచిస్తున్నాయి. 1949-50 బడ్జెట్ అంచనాల ప్రకారం పన్నులు

వసూలు చేయు శాఖలకే పదికోట్ల రూపాయలు ముట్టజెప్పుకోవలసి వస్తోంది. వేలకొలది జీతాలతో నిరంకుశ వర్గానికి కొత్త కొత్త ఉద్యోగాలు ఇవ్వబడుతున్నాయి. తక్కువ జీతాలు పుచ్చుకునేవారి కరువు భత్యాలుమాత్రం ఎప్పుడూ గొర్రెతోకల్లాగే ఎదుగూ బొదుగూ లేకుండా ఉంటున్నాయి. ప్రతి ప్రభుత్వోద్యోగికి ఈ విషయం స్వానుభవైక వేద్యమే. బడా పెట్టుబడిదారీ వర్గానికి బాకాఅయిన 'ఈస్టర్న్ ఎకానమిస్ట్'కూడా 1949మార్చి 4వ తేదీ సంపాదకీయంలో ఈ వాస్తవిక విషయాన్ని కాదనలేకపోయింది.

అభివృద్ధి శాఖలకోసం కేంద్ర ప్రభుత్వము ప్రత్యక్షంగాగానీ, లేక రాష్ట్ర ప్రభుత్వాలకు సబ్సిడీగా ఇచ్చే సహాయ రూపంలోగానీ క్రిందివిధంగా ఖర్చు పెడుతూ ఉంది.

| | 1948-49 అంచనా | 1948-49 సవరణ (రివైజ్డ్) | 1949-50 |
|---|---|---|---|
| అభివృద్ధికోసం రాష్ట్రాలకు | 30 | 18 | 26.8 |
| పారిశ్రామికాభివృద్ధి | 7.8 | 10.9 | 13.1 |
| మొత్తం | 37.8 | 28.9 | 39.9 |

1948–49 లో సాగించిన 'ఎకానమీ డ్రైవ్' (మితవ్యయం)లో దాదాపు తొమ్మిదికోట్లు తగ్గించినా 1949–50 లో మొదటికంటెకూడా ఎలా పెరిగిపోయిందో పై అంకెలు స్పష్టంగా తెలియజేస్తున్నాయి.

(ఆహారధాన్యాదులకిచ్చే సబ్సిడీలకంటెకూడా పెద్ద మొత్తంలో ఉన్న) ఈ అంకెలను చూచి నిజంగా పారిశ్రామికాభివృద్ధికోసం తీవ్రమైన ప్రయత్నాలు జరుగుతున్నాయని ఎవరైనా పొరపడవచ్చు. కాని అలాంటిదేమీలేదని 1949 మార్చి 1 వ తేదీన జాన్‌మత్తాయి పేర్కొన్న ప్రధాన ప్రణాళికలనుబట్టే తేటతెల్లమవుతూ ఉంది.

"డేరాడూన్‌లోని అటవీ పరిశోధనాగారాన్ని విస్తృతం చేయడం, అండమాన్ దీవుల్లో అడవులను వృద్ధి చేయడం, అస్సాం లోయలో ఉన్న కోసీ, నర్మదా, తపతీ, సబర్మతీ స్కీముల విషయమై ప్రాథమిక కృషి సాగించడం, కూర్గ్, సి. పి. బీరారు ప్రదేశాల్లో పరిశోధన చేయడం, కేంద్ర జలమార్గాలనూ, నౌకాయాత్రలనూ, ఇర్రిగేషన్ పరిశోధనశాలనూ పునర్నిర్మించడం, ఇండియా వ్యవసాయ పరిశోధనశాలలను పెంపొందించడము, ప్రాథమికవిద్య నభివృద్ధిచేయడము... కేంద్ర ప్రభుత్వంతనవాటాగా దామోదరలోయస్కీముకోసం అయ్యే ఖర్చులో 2 కోట్ల పదిలక్షల రూపాయలూ, గృహనిర్మాణానికీ, అభివృద్ధి ప్రణాళికలకూ 90 లక్షలరూపాయలూ సింద్రీలో నిర్మించబడుతూఉన్న ఎరువుల ఫ్యాక్టరీకి 4 కోట్ల 93 లక్షల రూపాయలూ, విమాన ప్రయాణాభివృద్ధికి 2 కోట్ల 92 లక్షల రూపాయలూ, వార్తా ప్రసారానికి 96 లక్షల రూపాయలూ బడ్జెట్‌లో ప్రత్యేకించబడినవి."

"ఇక పారిశ్రామికాభివృద్ధి విషయంలో జాతీయాభివృద్ధికి అవసరమైన ప్రధాన పరిశ్రమలకు శ్రీకారం చుట్టబడింది...ఇందులో ముఖ్యంగా పేర్కొనదగినవి టెలిఫోన్ సామాగ్రిని ఉత్పత్తిచేసే టెలిఫోన్ ఫ్యాక్టరీ

'ఒక షిప్పింగ్ కార్పరేషన్'ను ఏర్పరచడం, ఈ కార్పరేషన్‌లో ఈ సంవత్సరం వచ్చేసంవత్సరం కలిసి మొత్తం 6 కోట్ల 98 లక్షల రూపాయల పెట్టుబడి పెట్టడం జరుగుతుంది. ఉక్కును తయారుచేయడానికి ఉక్కు ఫ్యాక్టరీ, వైర్‌లెస్ సామాగ్రిని తయారుచేసేందుకు కొన్ని ఫ్యాక్టరీలు, కృత్రిమనూనె, మెషీన్ పనిముట్లు, కేబుల్స్, డీసెల్ ఇంజన్లు, భారీ ఎలక్ట్రిక్ సామాగ్రి. ఈ పరిశ్రమలన్నిటికి ఇప్పుడు ప్రారంభోత్సవం చేయబడుతుంది. ముమ్ముందు వీటిని అభివృద్ధిచేయడం జరుగుతుంది."

పై సూచించిన 20 ప్రణాళికల్లో 19 ప్రణాళికలకు నిజమైన పారిశ్రామికాభివృద్ధితో ఎట్టి సంబంధమూ లేదు. ఇందులో రవాణా సాధనాలు, ఇర్రిగేషన్, ఎరువుల ప్రణాళికలు చాలా ప్రాముఖ్యమైనవి. ఒక్క ఉక్కు కర్మాగారాన్ని మాత్రం పైవాటినుంచి మినహాయించవలసి ఉంటుంది. ఇది మాత్రం ముఖ్యమైన పరిశ్రమే. కాని పరిశ్రమలు సప్లయిలశాఖ తరఫున మార్చి 9 వ తేదీన డాక్టరు శ్యామప్రసాద్ ముఖర్జీ బడ్జెట్ అంచనాలు వేసేటప్పుడు ఇనుము, ఉక్కు కర్మాగారాల పేరైనా ఎత్తలేదనే విషయం ముఖ్యంగా ఇక్కడ గమనించవలసి ఉటుంది.

'ప్రాథమికకృషి' కొనసాగించడం వచ్చే సంవత్సరంలోకూడా జరిగేటట్లు లేదు. యుద్ధకాల ఆర్థికవిధానాన్ని దృష్టిలో ఉంచుకొని ఆ అవసరాలను తీర్చడంకోసమే ఈ ప్రణాళిక తయారు చేయబడింది. 'సమిష్టిరక్షణ'కోసం ఆంగ్లో అమెరికన్ సామ్రాజ్యవాదులతో కడపటిసంధి కుదిరేవరకు ఈ ప్రణాళికలేవీ అమలుజరిగే లక్షణాలు కనపడడంలేదు. ఆ విధంగా సంధికుదిరిన పిమ్మటనే సామ్రాజ్యవాదులప్లానుల కనుగుణంగా ఈ పరిశ్రమలను నెలకొల్పడానికి వారి సహాయం లభిస్తుంది.

ప్రపంచ ఆర్థికసభల్లో (UNECAFE) అమెరికా ఏజెంట్లు నిర్దేశించినట్లు అంతర్జాతీయబ్యాంకు విధించిన షరతులన్నిటికి తలఒగ్గి ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులకు ముడిసరుకుల నందజేసే ఒక వ్యావసాయిక దేశంగా ఇండియా తయారుకాబోతూ ఉందని ఈ 'పారిశ్రామిక' ప్రణాళికలే తెలియజేస్తున్నాయి.

రానున్న ప్రపంచ ఆర్థిక సంక్షోభానికి గురికాకుండా పెట్టుబడిదారీ వర్గాన్ని ఆ సంక్షోభంనుంచి బైటబడవేయడానికే ఈ ప్రణాళికలు తయారుచేయబడుతున్నాయి. పెట్టుబడిదారులకు లాభాలను గ్యారంటీచేయడానికే ఇవి ఉద్దేశించబడ్డాయి. 'హిందూస్తాన్ ఎయిర్‌క్రాఫ్ట్‌ఫ్యాక్టరీ' 'దామోదర్‌వాలీ కార్పరేషన్' వగైరాలలో జరిపినవిధంగానే తదితర అన్నిపరిశ్రమల్లోకూడా పెట్టుబడి పెట్టడం, ఆయా పెట్టుబడిదారులతో నిండిన 'బోర్డు'లతో వాటి నిర్వహణ కొనసాగించడం బ్రహ్మాండమైన జీతాలతో 'పబ్లిక్ కార్పరేషన్'లలో గవర్నమెంటు తన ఇష్టంవచ్చిన సభ్యులను నామినేట్ చేయడం - ఇదే ప్రభుత్వపాలసీ.

షిప్పింగ్ కార్పరేషన్ వగైరాల్లో ప్రభుత్వమే ఎక్కువగా పెట్టుబడిపెట్టి ప్రయివేటు పెట్టుబడిదారులకు లాభాలను గ్యారంటీ చేసింది. రానున్న సంక్షోభము ఫలితంగా నష్టం వచ్చే పరిస్థితిలో

ప్రజలపై పన్నులు వేయడంద్వారా ఆ నష్టాన్ని భర్తీచేసి పెట్టుబడిదారులకు లాభాలను గ్యారంటీ చేస్తూ హామీ ఇచ్చింది. దీనిఫలితంగానే గత సంవత్సరము 'ఎకానమీ డ్రైవ్'లో 'కోతలు' కోయడం - జీతాలు తగ్గించడం - జరిగింది. ఈ తగ్గింపు కార్యక్రమం రానున్న సంవత్సరంలో ఇంకా విరివిగా అమలు జరుపబడుతుంది. భారతదేశంలోకూడా వ్యాపిస్తూ ఉన్న ఆర్థికమాంద్యమునుంచి తప్పుకోడానికి భారత పెట్టుబడిదారులు ఇప్పటినుంచే ప్రభుత్వ సహాయంతో అన్ని కట్టుదిట్టాలు చేసుకుంటున్నారు. అమెరికాలో వ్యాపించిన ఆర్థికమాంద్యం ఫలితంగా ఇండియాను తమకు ముడిసగుకులు సప్లయిచేసే దేశంగా అట్టిపెట్టుకోడానికి అమెరికా పెట్టుబడిదారులు ప్రయత్నిస్తున్నారు.

# II

సంక్షోభ కాలపు వ్యయభారంనుండి విముక్తి కావటానికి భారాన్నంతా పేద ప్రజల నెత్తిన పడవేసి, పెట్టుబడిదారీ వర్గానికి సంపూర్ణ రక్షణ కల్పించారు. ఈ విధంగా ఆదాయ వ్యయాలను సరిపెట్టడంద్వారా ఆర్థిక సంక్షోభం మరింత తీవ్రరూపం దాల్చుతుంది.

జీవితావసర వస్తువులపైన విధించబడ్డ అదనపు పన్నులను ఒకసారి పరికిస్తే, సామాన్య ప్రజానీకాన్ని ఎలా నిలువు దోపిడీ చేస్తున్నారో,- దరిద్రాపుచర్మాన్ని ఒలుచుకుంటున్నారో - బోధపడుతుంది. 1947-48 సం॥ లో ఎక్సైజ్ డ్యూటీలు ద్వారా 22 కోట్ల రూపాయల ఆదాయం వచ్చేది. కాని 1948-49 సం॥లో ఆదాయము 50 కోట్ల రూపాయలకు పెంచబడింది. 1949-50 సం॥లో అదే ఆదాయం 70 కోట్ల రూపాయలని అంచనా వేయబడింది, అంటే 1947-48 సం॥ నాటి ఆదాయంకన్న మూడురెట్లు పైపెచ్చు. యుద్ధకాలంలో ఉన్నత శిఖర మందుకొన్న 1945-46 సం॥పు ఆదాయం 46 కోట్ల రూపాయలకు మూడువంతులకు పైగా మించిపోయింది. ఈ జీవితావసర వస్తువులపైబడ్డ పన్నులు ప్రధానంగా ముతకబట్టలపైన, సామాన్య వస్త్రాలపైన విధించబడ్డవి. దీనివల్ల 9 కోట్ల రూపాయలు రాబట్టాలని అంచనా. అంటే బట్టలుధరలు పెంచబడుతాయి. ఇప్పటికే తల మునకలైన ధరలతో అరు సంవత్సరాలుగా యమయాతనకు గురవుతున్న ప్రజలు బట్టకరువుతో మరింత కష్టాల పాలవుతారు.

ధరలు సామాన్యప్రజానీకానికి అందుబాటులో లేనప్పుడు, వస్త్రాలు కుప్పలు కుప్పలుగా గోడౌనులలో మూల్గుతున్నప్పుడు యీ విధంగా అధికపన్నులు విధించటం సామాన్య ప్రజలకు తలకొరివి పెట్టటంవంటిది. " ఈ స్ట్రెన్ ఎకనమిస్టు " దీనిని గూర్చి ప్రస్తావిస్తూ, నామమాత్రమైన ప్రస్తుతం వస్త్రాలపైనున్న కంట్రోల్సుకూడ యింతటితో ఎగిరిపోయినట్లేనని ప్రకటించింది.

"వస్త్రాలపై కంట్రోలు విధానంలో పన్నులు విధించటంవల్ల మరింత గందరగోళ మౌతుందనటానికి ఎట్టి సందేహం లేదు. మూలపడి... నిల్వాలు అమ్ముడుపోకపోగా ... పోతాయి. ...

సంభవించవచ్చు. కంట్రోల్ ప్రవేశపెట్ట బూనుకోటం విచారకరమైన విషయం. అందువల్ల కంట్రోల్‌ను దూరం కావటం వల్ల ఎక్కడా ఎట్టినష్టం సంభవించదు."

ప్రజలు ఒక ప్రక్క దిగంబరులై, కట్టుకోవటానికి బట్టలేక అలమటి స్తుంటే, అమ్ముడుపోక నిల్వవున్న బట్టను బూడిదపాలుచేసేస్థితి దాపురిస్తోంది. ఇదేమీ కొత్తకాదు. 1930 ఆర్థికమాంద్యపు రోజుల్లో ఇట్టి హృదయవిదారకమైన ఘటనలు చూసాం.

ఈవిధంగా పేదప్రజలపైన వరుసగా దాడి సాగిస్తూ మరోవైపు పెట్టుబడిదారు లకు ఇదేకాలంలో పన్నుల మినహాయింపు చేస్తూ వస్తున్నారు.

1947 లో వ్యాపారపు లాభాలపైన విధించబడ్డ కొన్ని పన్నులనుగూర్చి ప్రస్తా విస్తూ "ఈస్టర్న్ ఎకనమిస్టు" యిలా వ్రాసింది. వాస్తవానికి ఆచరణలో యీ పన్నులకు ఏనాడో ఉద్వాసన చెప్ప బడింది.

"ప్రస్తుతం కొనసాగుతున్న బడ్జెట్ విధానంవల్ల కల్గిన పెద్దచిక్కేమిటంటే 1947-48 బడ్జెట్‌లో జరిగిన అన్యాయా లను ఎలా సర్దుబాటుచేయాలా? అని. ఈ అన్యాయాలను సర్దుబాటు చేస్తేనే గాని పెట్టుబడిదార్లలో ఆత్మబలం వృద్ధి చెందదు. ఇదే సమస్య షణ్ముఖంచెట్టి గారిని ఎదుర్కొంది. ఆయన 1948-49 సం॥ బడ్జెట్ ప్రవేశపెట్టుతూ యీ విష యంలో కొంతకృషి చేసాడు. ఆ కృషి ప్రస్తుత బడ్జెట్‌లో జయప్రదంగా మరింత ముందుకు తీసు[illegible]ంది. 1948 మార్చిలో [illegible] పన్నుల రేటు[illegible]

ఆదాయాలవిషయంలో రెండుసార్లుకూడ కొంత కరుణచూపటం - ఇవన్నీ 1947-48 సం॥ పన్నులభారాన్ని చాలావరకు తొలగించినవని చెప్పవచ్చు. అన్నిటికన్న ముఖ్యమైన విషయమేమిటంటే వ్యాపా రస్థులలో ఆత్మనమ్మకం ప్రబలుతుంది. రాజకీయ, ఆర్థిక కారణాలపైన వ్యాపా రపు ఆదాయాలలో అధికభాగాల్ని గుంజుకోవటం ప్రస్తుత బడ్జెట్ విధానం యొక్క దృష్టికాదని వారిలో నమ్మకం కల్గచేస్తుంది." (ఎడికేడ్ ఆఫ్ ఇండియన్ బడ్జెట్-మార్చి 4, 1949)

ఈ విధమైన సౌకర్యాలు కలుగ చేస్తున్నప్పటికి పెట్టుబడిదారులు ప్రభు త్వానికి అప్పులను యివ్వనిరాకరిస్తు న్నారు. 1948-49 బడ్జెట్ అంచనా ప్రకారం 150 కోట్లరూపాయలు అప్పుల ద్వారా సంపాదించాలని వుంది. కాని, యథార్థంగా ఈ విధంగా సమకూరింది 55 కోట్లరూపాయలు మాత్రమేనని పునర్విచారణ జరిగిన పిదప అంచనాల ప్రకారం తేలుతోంది. అందు వల్ల 1949-50 సం॥ బడ్జెట్‌లో యిట్టి ఆశలకు తిలోదకా లివ్వబడ్డాయి. 85 కోట్లరూపాయలు మాత్రమే అప్పుల ద్వారా రాబట్టాలని ప్రభుత్వం సంకల్పిం చింది.

పెట్టుబడిదారులనుండి వస్తున్న యిట్టి వత్తిడి మూలంగా, ప్రభుత్వం సంక్షోభకాలపు అమిత వ్యయభారా న్నుండి బయటపడటానికి దొడ్డిదారులు తొక్కటం ప్రారంభించింది. దానితో పెట్టుబడిదారీవర్గంలోనే కలతలు, వివిధ ముఠాలమధ్య ఘర్షణ, పెట్టుబడిదారీ ప్రభుత్వానికి, పెద్ద పెట్టుబడిదార్లకుమధ్య ఘర్షణ ప్రారంభమైంది.

ఉదాహరణకు విదేశ మారకపు సంపత్తిలో అధికభాగం వ్యయపర్చి ఆహార ధాన్యాలను దిగుమతి చేయటం. దీనివల్ల పారిశ్రామిక యంత్రములదిగుమతికై వ్యయపర్చాల్సిన విదేశ మారకపు నిధిలో తరుగుదల వస్తోంది. దిగుమతి పన్నుల (కస్టమ్స్) వల్ల వచ్చే ఆదాయం 198-49 సం॥లో తలవని తలంపుగా ఒక పెన్నిధిలాగా లభించింది. మొదట్లో యీ దిగుమతి పన్నులవల్ల 81 కోట్ల రూపాయల ఆదాయమని అంచనా వేయబడింది. కాని పునర్విచారణ చేయబడిన అంచనాల ప్రకారం యీ ఆదాయం 117 కోట్ల రూపాయల వరకు ప్రాకింది. 1949-50 సం॥లో యిది 111 కోట్ల రూపాయలవరకు వుంటుందని వూహిస్తున్నారు. దిగుమతి కంట్రోల్స్‌ను సడలించబట్టి యీ తలవని తలంపుగా వచ్చిన ఆదాయం సాధ్యపడింది. కాని దీనివల్ల దేశీయ పరిశ్రమలు ఇప్పటికప్పుడే దెబ్బతినటం ప్రారంభించాయి. ఢిల్లీలో సమావేశమైన వాణిజ్యమండలి పెచ్చుపెరుగుతున్న విదేశ పోటీనుంచి రక్షణ కావాలంటూ తీర్మానించింది. అనేక వస్తువులపైన విధించబడ్డ ఎక్సైజ్ డ్యూటీల వలన చుట్టుప్రక్కలవున్న దేశాలలోని ఇండియా ఎగుమతి వ్యాపారం దెబ్బ తింటోంది. నూలు బట్టలపైన విధించబడ్డ ఎక్సైజ్ డ్యూటీమూలాన మధ్యప్రాచ్యపు మార్కెట్‌కు ప్రమాదంవాటిల్లబోతోంది. తిరిగి కోలుకొనే జపాన్ వస్త్రాల పోటీ ప్రమాదం ఎదుర్కొంటోంది. 'ఈస్టర్న్ ఎకనమిస్టు' దృష్టిలో పంచదారపైన విధించబడ్డ ఎక్సైజ్ డ్యూటీవల్ల ఇండియాలో అమ్మకాలు పడిపోవటమే కాకుండా, పాకిస్థాన్ మార్కెట్ చేయి జారిపోతుంది.

ప్రభుత్వం తన అమితవ్యయ భారాన్నుంచి విముక్తి కావటానికి ప్రధానంగా పన్నిన యుక్తి లోటుబడ్జెట్‌ను తయారు చేయటం.

1948-49 సం॥ బడ్జెట్ అంచనా ప్రకారం మొత్తంలోటు (రెవిన్యూ, కాపిటల్ బడ్జెట్‌లను కలుపుకొని) 12 కోట్ల రూపాయలుమాత్రం. కాని ఆచరణలో జరిగినదేమిటి? పునర్విచారణ చేయబడిన అంచనాల ప్రకారం ఆ లోటు 185 కోట్ల రూపాయిలై కూర్చుంది. 1945-49 సం॥పు అంచనాలలో రివెన్యూ బడ్జెట్‌లో 45 కోట్ల రూపాయిల కల్పిత 'నిల్వ' ను చూపెట్టారు. ఇదిఎందుకు చూపెట్టాల్సి వచ్చిందంటే కాపిటల్ బడ్జెట్‌లో వచ్చిన పెద్ద తొర్ర-134 కోట్ల రూపాయల-నుండి ప్రజల దృష్టిని మార్చడానికిమాత్రమే. 1949-50 సం॥పు అంచనాలలోవున్న యీ "కనపడని వ్యత్యాసం" యుద్ధకాలపు బడ్జెట్‌లను గుర్తుకు తెస్తోంది.

ప్రభుత్వం కూడబెట్టుకున్న నిల్వను రిజర్వుబ్యాంకునుంచి లాక్కొని గత సం॥ యీ కనపడని వ్యత్యాసాన్ని భర్తీ చేసింది. ఇందుమూలకంగా రిజర్వుబ్యాంకులో 1948 సం॥ మార్చినాటి 278.67 కోట్ల రూపాయల నిల్వ నేటికి 207.13 కోట్ల రూపాయలకు తరిగిపోయింది. ఈ నిల్వకూడ యుద్ధకాలపు ఇన్‌ఫ్లేషన్ కరెన్సీవల్ల సంభవమైంది. కనుక అట్టి నిల్వను గతసంవత్సరంలో భారం భాటగా [illegible] పెట్టటంవల్ల ఇన్‌ఫ్లేషన్ మరిం[illegible] [illegible]ంకు నిల్వలు క[illegible] [illegible]పర్చేత[illegible]

సూచిక 29.44 వుంటే 1948 జులైకి 389.6 కు పెరిగిపోయింది. 1948 నవంబరుకు 382.2 వద్ద నిలచి పోయింది. 1949-50 సం॥ బడ్జెట్‌లో 'కనపడని పెద్ద వ్యత్యాసం' భర్తీచేయటంకోసం రిజర్వుబ్యాంకు నిల్వలను ప్రభుత్వం లాగేస్తుంది. ఇది మరింత ఇన్‌ప్లేషన్‌కు దారితీయక మానదు.

లాభాలను, ధరలను వాటి యిష్టానికి వదలిపెట్టి, వేతనాలను, అధికధరల అలవెన్సులను మూతి బిగియగట్టటం పైగా బడ్జెట్‌లో లోటు చూపెట్టటం వీటన్నిటిఅర్థం సామాన్య ప్రజానీకాన్ని యథేచ్ఛగా దోచుకోనివ్వటం వాళ్ళ కడుపుకొట్టటం, పెట్టుబడిదార్లకు లాభాలను విపరీతంగా కూర్చిపెట్టడం ఇదేసరిగా యుద్ధకాలపు ప్రత్యేక లక్షణం.

ఇన్‌ఫ్లేషన్‌తో యీ విధమైన దాంపత్యం చేయటం ఆర్థిక సంక్షోభాన్ని తీవ్రతర పర్చటమౌతుంది.

జీవనవ్యయంలో పెరుగుదల మొదటుగా కార్మికవర్గాన్ని ఎప్పటికప్పుడు రెచ్చగొట్టుతూనేవుంది. ఈ విధంగా లక్షలాది కార్మికులను సమ్మెపోరాటాలవైపుకు తరుముతోంది. ఎంతటి దారుణహింసాకాండ జరిపినప్పటికి, యీవర్గం తలవంచటమనేది కలలోనివార్త. ఒక పోరాటంలో ఓటమిపొందటమనేది తాత్కాలికమైనది. ధరలు ఏమాత్రంపెరిగినప్పటికి కొత్తకొత్త శక్తులు యీ వర్గంచుట్టూ చేరతాయి. మళ్ళీమళ్ళీ పోరాటాలు విజృంభిస్తూ వుంటాయి. ప్రభు... పెట్టుబడిదారులు కలసి ఫా... ...నం ద్వారా ...

వెళ్ళబుచ్చుకొందామన్న ఆశ అడియాస అవుతోంది.

ఇక ఇంకో విధంగా చూస్తే (సివిల్ పరిపాలనలోను, సైనికశాఖలోను) ప్రభుత్వమే కార్మికులపాలిట ఒక బడా యజమాని అవటం మూలాన ఇన్‌ఫ్లేషన్ ఆట పూర్తిగా సాగనివ్వటం దానికి యిష్టం వుండదు. అందువల్ల అధికధరల ఎలవెన్సు తగ్గించటం, ఇన్‌ఫ్లేషన్ ననుసరించి వీలయినంతమందిని పనినుంచి తొలగించటం చేస్తుంది. కొద్దిగా అధిక ధరల అలవెన్సు యివ్వటంద్వారా, చౌకడిపో సౌకర్యాలు కల్గించటంద్వారా ప్రభుత్వం పెట్టుబడిదార్లకు "చెడు అదర్శాలు" కూర్చిపెట్టక తప్పటంలేదు.

పోతే, భారత పెట్టుబడిదారులు ఇన్‌ఫ్లేషన్ కారణంగా కూడబెట్టుకున్న నిల్వలు పారిశ్రామిక పెంపుదలకు లాభసాటిగా ఉపయోగపడటంలేదు. ఎందువల్లనంటే విదేశమారకానికి అవసరమైన డాలర్ల కొరతవల్ల (ప్రధానంగా విపరీతమైన ధరలుపెట్టి ఆహారధాన్యాల దిగుమతి చేయటంవలన యిది సంభవించింది.) భారీయంత్ర పరికరాలను భారత పెట్టుబడిదారులు కొనవచ్చేసరికి విదేశీమారకపు నాణాలు లభ్యం కావటంలేదు. అందువల్ల ఇన్‌ఫ్లేషన్ మూలంగా పేర్చుకొన్న లాభాలు నిరుపయోగమవుతున్నాయి. తిరిగి యీలాభాలను పెట్టుబడిగాఉపయోగించి, పరిశ్రమలను అభివృద్ధిపర్చటానికి ఉపయోగపడటంలేదు. ప్రజలపైన యింకా ఉధృతంగా బండిని తోలమని ప్రభుత్వాన్ని పెట్టుబడిదారులు వత్తిడి చేస్తున్నారు.

ఈ విధంగా ప్రభుత్వాన్ని వత్తిడి ...ంలో భారత పెట్టుబడిదార్లకు

విదేశ పెట్టుబడిదారులు కోరుతున్నారు.

భారత దేశంలోని బ్రిటిష్ పెట్టుబడిదార్ల పత్రిక 'కాపిటల్' అమెరికానుంచి ప్రపంచ బ్యాంకుద్వారా అప్పు భారత దేశానికి కావాలన్న విషయంపై యిలా వ్రాసింది.

"ఇక్కడ ఒక విషయం గమనించాలి. విదేశ పెట్టుబడిదారుల సంతృప్తి పరచేందుకు యిచ్చేహామీలు భారత పెట్టుబడిదారులకు మరింత నమ్మకం చేకూర్చి పెట్టుతాయి. అంతర్జాతీయ బ్యాంకునుండి అప్పు ధారాళంగా వచ్చిననాడు దేశంలో మార్కెట్ కోలుకుంటుంది. దేశంలోకి విదేశపెట్టుబడులను ఆహ్వానించాలా? వద్దా? అని పెద్దప్రశ్న. కాని ఉన్నయదార్థం ఇది: దేశీయపెట్టుబడిదారులు వచ్చేకష్టనష్టాలకు బాధ్యత వహించటానికి సిద్ధపడితేనేగాని విదేశ పెట్టుబడులు భారతదేశంలో ప్రవేశించటానికంత అవకాశంలేదు" (ఫిబ్రవరి 24, 1949).

# III

సంక్షోభాన్ని తీవ్రతరం చేయటం ద్వారా పెట్టుబడిదారులు ప్రభుత్వంపై వత్తిడి తెస్తున్నారు, అంటే ప్రస్తుత ప్రభుత్వం పెట్టుబడిదారుల కోర్కెలు మన్నించటంలేదనిగాని, వారి శ్రేయస్సుకు కృషి సల్పటంలేదనిగాని అర్థం ఎన్నటికీ కాదు.

పెట్టుబడిదారులు ప్రభుత్వంపైన చేస్తున్న విమర్శ ప్రభుత్వపాలసీ ఏవిధంగా వుండబోతుందోసూచిస్తుంది. పెట్టుబడిదారీ విమర్శకులు నేడు ఏది అర్థిస్తున్నారో అది రేపు ప్రభుత్వం చేస్తుంది.

బడ్జెట్ పైన ప్రభుత్వానికి, పెట్టుబడిదారులకు మధ్యవున్న నామమాత్రమైన కీచులాట ముగిసిందని 1949 మార్చి 16 తేదీన మత్తయ్ పార్లమెంట్ ఉపన్యాసం చెప్పుకొంది

"ధరలు పెరుగుతూ, ఇన్ ఫ్లేషన్ ఉధృతంగా అభివృద్ధి చెందుతున్నప్పుడు-ఉదాహరణకు 1948 జనవరి నుండి 1948 ఆగస్టు, సెప్టెంబరు మాసాలమధ్య ఇన్ ఫ్లేషన్ లో పెరిగినప్పుడు-ఇన్ ఫ్లేషన్ సమస్యను పరిష్కరించే సక్రమవిధానం ఇన్ ఫ్లేషన్ ను తగ్గించటానికి తీవ్రచర్యలు తీసుకోవడం కాకేకాదు, మొట్టమొదటగా చేయవల్సింది ఇన్ ఫ్లేషన్ పెరుగుదలను ఆపు చేయటం......

"ధరలను తగ్గుమొఖం పట్టించటానికి క్రమబద్ధమైన విధానం నింపాదిగా అమలులోకి తీసుకురావాల్సివుంటుంది. ఎందుకంటే ప్రతిదశలోను ధరలకు ఖరీదుకు మధ్య సరియైన సంబంధాలు వుండేటట్లు మనం చూడాలి...ఆహార ధాన్యాల ధరలను మనం ఆకస్మాత్తుగా తగ్గించి వేయగలం. కాని ఉత్పత్తిదారుడు ఉత్పత్తికై ఖర్చులను అలా తగ్గించుకోలేడు. ఆహార ధాన్యాల ధరలు పడిపోతే, ఉత్పత్తిదారుడు కూలీదగ్గరకు వెళ్ళి నిర్మొఖమాటంగా యిలా చెప్పలేడు. "రేపటి నుంచి నీకు తక్కువజీతం ముట్టుగా వుంటుంది."

"ఇదే పారిశ్రామిక వస్తువులకు వర్తిస్తుంది. గొన్ని దేశాలు ప్రయ

త్గించినట్లుతీవ్రచర్యలద్వారా ధరలను తగ్గించగలం. కాని వెంటనే శ్రమవిలువను తగ్గించలేకపోయినట్లయితే అది ఆర్థిక అల్లకల్లోలానికి దారితీస్తుంది. సరఫరా దెబ్బతింటుంది. ఇన్‌ఫ్లేషన్ మరింతపెచ్చు పెరుగుతుంది".

ఇంకా యిలా అన్నాడు.

"అమెరికాలోని ధరల పరిస్థితిని గూర్చినిపుణుల అభిప్రాయమేమైనప్పటికి, ప్రపంచమంతటా ధరలు పడిపోవటం ఖాయమనుకొని, భారతదేశం దానికి తయారుకావటంమంచిది. మొత్తంమీద భారతప్రభుత్వం ధరలను తగ్గించటంలో క్రమానుగతమైనతన పంథాను చురుకుగా కొనసాగిస్తూవుండాలి. అంతేగాని పెద్దపెట్టున ధరలను తగ్గించటానికిపూనుకోరాదు. అలా పూనుకొన్న పక్షంలో ప్రపంచశక్తులకు మనం బందీలుగావటం సంభవిస్తుంది. అప్పుడు సమస్య మనకు కొరకరానిదిగా తయారవుతుంది."

ఈ విధంగా మత్తయ్ నిర్ణీతమైన ఇన్‌ఫ్లేషన్ పాలసీని ప్రకటించాడు. ఇదేసమయంలో విదేశీ, స్వదేశీ పెట్టుబడిదారులకు నమ్మకం కల్గించేందుకు సర్వవిధాల ప్రోత్సాహ మివ్వబడుతుంది.

సర్దార్ పటేల్ ఖచ్చితమైన హామీని పెట్టుబడిదారులకు యివ్వనే యిచ్చాడు. బ్రిటిషు ప్రభుత్వం నామమాత్రంగా చేస్తున్నట్లుగాకూడ ఇకముందు ఇండియాలో పరిశ్రమలు జాతిపరం చేయబడవని ప్రకటించాడు. 1949 ఫిబ్రవరి 23 తేదీన మద్రాసులో వాణిజ్యమండలి సభలో మాట్లాడుతూ యిలాఅన్నాడు.

"పరిశ్రమలను జాతిపరం చేస్తామేమోనని భయపడకండి. పరిశ్రమలను జాతిపరంచేసే శక్తిగాని, వాటిని నడిపే తాహతుగాని ప్రస్తుతం ప్రభుత్వానికి లేదని ప్రభుత్వం తరఫున నేను తెలియచేస్తున్నాను ...... ఎవరైనా జాతిపరం చేయటాన్నిగూర్చి మాట్లాడితే, అది నాయకత్వానికై దేవులాటేగాని, నిజంగా జాతిపరం చేయటానికిమాత్రం కాదు. నాకు ఆ రకంగా జాతిపరం చేయటంలో నమ్మకం లేదు."

మార్చి 6వ తేదీన నెహ్రూ ఢిల్లీలో జరిగిన వాణిజ్యమండలి సభలో మాట్లాడుతూ ఇట్టి హామీనే తిరిగి ఇచ్చాడు. మొదటి పదిసంవత్సరాలవరకు జాతిపరం చేయటం అనే ప్రశ్న లేనే లేదన్నారు. ఇప్పుడు ఈరకమైన హామీలను ప్రదానం చేస్తున్నారు. అంటే ఎన్నికల సమయంలో జాతిపరం చేయటాన్ని గూర్చి పల్కించిన వాగ్దానాలు యింతటితో పూర్తిగగంగలోకలసిపోయాయన్నమాట.

అందువల్లనే మత్తయ్ యీ విషయాన్నిగూర్చి ప్రస్తావించటమే తప్పు దండుగ అని మానేశాడు. పైగా పెట్టుబడిదారులకు లాభసాటి వాగ్దానాలు చేస్తున్నాడు.

"అధిక ధరలవిషయమటుంచి సూటిపన్నుల (Direct taxation) భారం ద్రవ్యసేకరణకు అడ్డమొస్తోంది. రెండోప్రక్క దేశమందంతట రాజకీయ, ఆర్థిక వాతావరణం గందరగోళంగావుంది. అందుచే పెట్టుబడులను యీపరిస్థితి దెబ్బతీస్తోంది."నాబడ్జెటు పెట్టుబడిదారుల నుత్సాహపరచడంలో కొంతవరకు సాయపడుతుంది."

భారతదేశ పెట్టుబడిదారులకు యీ లాభసాటి వాగ్దానాలకు తోడు, విదేశ పెట్టుబడులు పెద్దఎత్తున, ఎట్టి నిబంధనలు లేకుండా, స్వేచ్ఛగా మన దేశంలో

చొచ్చుకుపోవటానికి చక్కటి సదవకాశాలను కల్గిస్తానని ప్రకటించాడు.

"అనుకొన్న ప్రకారం జాతీయ నిర్మాణప్రణాళికను జయప్రదంగా కొనసాగించటానికి కావాల్సిన ఆర్థిక స్తోమత భారత పెట్టుబడిదార్లకు లేదని నాకు నమ్మకం కుదిరింది. విదేశాలకు పోయి అప్పు తెచ్చుకున్న పక్షంలో ఆర్థిక స్తోమత చేకూరుటయే గాక, అవుసరమైన విదేశీమారకంకూడ లభిస్తుంది...అమెరికావైపుకు భారతదేశం యింకా మోరఎత్తుకు చూడటం చాలా అవుసరం" అన్నాడు జాన్ మత్తయ్.

ప్రపంచ బ్యాంకు కోరుతున్న $4\frac{1}{2}\%$ పెద్ద వడ్డీరేటుతో భారతదేశం అప్పు గైకొన్నట్లయితే, ఉరకలెత్తుక వస్తున్న మాంద్యంవల్ల, యీ ఎక్కువ వడ్డీరేటు మనకు తడిచి ముప్పందుం అవుతుందని మత్తయ్‌గారు వ్యాఖ్యానించారు.

"పోగా ఇక విదేశాలనుంచి వచ్చే సహాయానికి సంబంధించి నంతవరకు ఒకే ఒక వీలువుంది. అదే ఇతర దేశాల వ్యక్తిగత పెట్టుబడి ...... విదేశ పెట్టుబడిదార్లను ఆహ్వానించాలి ... పెద్ద పెద్ద పరిశ్రమల నిర్మాణంలో వారు పాల్గొనటమే కాకుండా, దానికి అవసరమైన నిధులు సేకరించటమే కాకుండా, విదేశమారకాన్ని యంత్ర పరికరాలను సంపాదించి పెడతారు. భారత పరిశ్రమలలో "లాభనష్టాలకు భాగస్వాములయ్యే" వాటాదారులను సంపాదించటంవల్ల పరిశ్రమల అభివృద్ధి చేయటంలో గల భారం కొంత తొలగిపోతుంది."

ఈ విధంగా ప్రభుత్వపు పాలసీ నగ్న రూపంలో బయటపడ్డది:

'నమ్మకం' కుదర్చటంకోసం జాతిపరం చేయటం అనేమాట తలపరాదు. పెట్టుబడిదార్లకు పన్నులభారం తొలగించాలి. అమెరికన్ గుత్తవ్యాపారస్థులకు మన ఆర్థిక జీవనంలో కీలకాన్ని వాళ్ళ యిష్టప్రకారం కట్టబెట్టి, తద్వారా వారిని మనపరిశ్రమల్లో వాటాదార్లుగా చేర్చుకొని, విదేశపెట్టుబడులను ధారాళంగా తెప్పించుకోవాలి' వారు మన పారిశ్రామికాభివృద్ధిని ఎప్పటికప్పుడు కాలికింద తొక్కిపట్టుతూ వుంటారు. అమెరికన్ పరిశ్రమలకు గొర్రెతోకలాగా మన పరిశ్రమలు తయారవుతాయి. ఉన్నకాస్త ఆర్థిక స్వాతంత్ర్యం ఊడిపోతుంది.

విదేశపెట్టుబడులను ప్రభుత్వపు ఋణం రూపంలోనే అంగీకరిస్తుందని ప్రభుత్వం యింతకాలంగా దంభాలు పలుకుతూ వచ్చింది. ఏ ప్రజాస్వామికప్రభుత్వమైనా విదేశీ పెట్టుబడులను ఋణరూపంలోనే స్వీకరించినప్పుడు ఆ ఋణాన్ని దాని యిష్టానుసారం ఖర్చుపెట్టుకోవచ్చు. ప్రజాస్వామిక ప్రభుత్వ అధ్వర్యాన భారీ పరిశ్రమల అభివృద్ధికి పూనుకోవచ్చు. దేశీయ ఆర్థికవిధానంలో పెట్టుబడిదారులు చొచ్చుకపోయి కీలకస్థానాన్ని పొందకుండా చేయవచ్చు. రెండుసంవత్సరాలుగా ప్రభుత్వం యిదే తన పాలసీగా డబ్బాకొట్టుతూ వచ్చింది. కాని యింతవరకు సోవియట్ సహాయాన్ని స్వీకరించటానికి తిరస్కరిస్తూ, ఆంగ్లో-అమెరికన్ గుత్తవ్యాపారస్థుల వాకిటి ముందు మోకరిల్లింది.

అమెరికనులు రెండుసంవత్సరాలుగా భారతప్రభుత్వానికి ఋణం యివ్వడానికి తిరస్కరిస్తున్నారు. 'వ్యక్తిగత పెట్టుబడులను' మాత్రమే భారతదేశంలో

ప్రవేశపెట్టుతామని పదే పదే చెప్పుతున్నారు. ఏది ఏమైనప్పటికి వారు ఒక విధమైన అభివృద్ధి ప్రణాళికను తయారు చేసి, దానిని అంగీకరించమని భారతప్రభుత్వాన్ని వత్తిడిచేసారు. ఇది ప్రపంచఆర్థిక మహాసభ (UNECAFE) లో పూర్తిగా వెల్లడైంది. ఈ ప్రణాళిక వ్యవసాయాన్నీ, రవాణా మార్గాలను అభివృద్ధి చేయటానికి మాత్రమే పరిమితం కావాలంటూ వారు ప్రపంచబ్యాంకుద్వారా వత్తిడితెస్తారు. ఈ విధంగా భారతదేశాన్ని వట్టి వ్యావసాయికదేశంగా మార్చి, భారతదేశాన్ని ఆంగ్లో - అమెరికన్ ఆర్థికవిధానంలో లీనంచేసుకుంటారు.

అమెరికన్ రాయబారి గ్రాడీ భారతదేశంలో కమ్యూనిస్టుపార్టీని, కార్మికోద్యమాన్ని, ప్రజోద్యమాలను అణగగొట్టమని చెప్పుచుగూడచెప్పాడు. 'జాతిపరం' మాట మరిచిపొమ్మని, పెట్టుబడిదార్లపైన పన్నులభారం తొలగించమని వత్తిడి చేసాడు. అమెరికన్ పెట్టుబడిదారుల ఈ పైకోర్కెలను భారత పెట్టుబడిదారులు హృదయపూర్వకంగా బలపర్చుతున్నారు.

భారత పెట్టుబడిదారీ ప్రభుత్వం అమెరికన్ గుత్తవ్యాపారస్థుల గొంతెమ్మ కోర్కెలను నెమ్మదిగా అంగీకరిస్తూ, దానిని తగిన కట్టుదిట్టాలు చేస్తోంది.

తాజాగా మత్తయ్ చేసిన ప్రకటన అమెరికన్ పెట్టుబడిదార్లకు ఒక స్వాగత పత్రం. అదిమన ఆర్థిక విధానంలోని కీలకాలను వాళ్ళకు కట్టబెట్టం మాత్రమే.

ఈవిధంగా మరొకసారి తలొగ్గటాన్ని సమర్థిస్తూ, ప్రభుత్వం చూపే సాకులేమిటి? మాంద్యం ముంచుకొస్తోంది. 4½% వడ్డీ రేటు చాలఎక్కువ. అమెరికన్ వ్యక్తిగత పెట్టుబడిదార్లను దేశంలో స్వేచ్ఛగా చొరబడనీయటంవల్ల వచ్చే లాభనష్టాలలో వాళ్ళు భాగస్వాములవుతారు. అమెరికన్ గుత్తవ్యాపారస్థులు అంతర్జాతీయ లాభాల దేవుళ్లలో అగ్రగణ్యులు. వారు యీవిషయంలో ఎంతో అనుభవజ్ఞులు. మర్రిచెట్టుప్రక్క వెంపలిచెట్టులాగా వారి భాగస్వాములు భారత పెట్టుబడిదార్లు అయినప్పుడు అమెరికన్ గుత్తవ్యాపారస్తులు అధికభాగం నష్టాన్ని భరిస్తారనుకోనటం, ఇండియన్ వాటాదార్లు అధిక లాభాలను పొందుతారనుకోవటం వట్టి అవివేకం.

మోసం చేయటంలో చేయితిరిగినవ్యక్తి తెలివిగా చేసేపని యీ విధంగానే ఉంటుంది. ప్రపంచబ్యాంకు ఎక్కువ వడ్డీ రేటు కోరిందన్న సాకుతో అమెరికన్ వ్యక్తిగత పెట్టుబడిదార్లను బొట్టుకాటుకపెట్టి పిలుచుకరావడానికి ఇదొక కుట్రమాత్రమే. తీరా ఆఖరి ఘట్టంలో భారతప్రభుత్వం ప్రపంచబ్యాంకు ఋణాన్ని, స్వీకరించటం, అమెరికన్ వ్యక్తిగత పెట్టుబడులను ఆహ్వానించటంకూడా చేసేటట్లుంది. ఈవిధమైన మార్గం అవలంబించటం మంచిదని ఈస్టర్న్ ఎకనమిస్టు అప్పుడే వెలిబుచ్చింది.

ఈ లోపల చేయాల్సిన ప్రధానమైన కృషి సంపూర్ణమైన "వ్యాపార నమ్మకం" కల్పించటమే. ఇందుకై భారత పెట్టుబడిదారీ ప్రభుత్వం కనీవిని ఎరుగనిరీతిలో దారుణ దమనీతిని ప్రయోగించి కార్మికవర్గ ప్రతిఘటనను అణస్తోంది, జీతాలను తగ్గిస్తోంది. వేలసంఖ్యలో ఉద్యోగాలనుండి తొలగిస్తోంది. ఇదే భారతప్రభుత్వం స్వదేశీ, విదేశీ పెట్టుబడిదార్ల సంయుక సంఘటనకు యిచ్చేహామీ.

# IV

ప్రస్తుత బడ్జెట్‌ను ఇండియా పెట్టుబడిదారులుకూడా విమర్శిస్తున్నారంటే కార్మికుల జీవనస్థాయిపై యింకా అతి దారుణంగా దాడిచేయడానికి, ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులకు పూర్తిగా అమ్ముడుపోవడానికి కావలసిన సన్నాహాలన్నీ పూర్తిచేస్తున్నారన్నమాట.

ప్రజల జీవనస్థాయిని రక్షించాలి అనే మేలిముసుగు క్రిందనే ఈ నటన అంతా సాగుతూ ఉంది.

భారతీయుల జీవనస్థాయి నానాటికి దిగజారి యింకా అధ్వాన్నమైపోతూ ఉందని 'ఈస్టర్న్ ఎకానమిస్టు' పెద్దగోల పెట్టింది. మనిషి 1 కి వచ్చే ఆదాయం రోజురోజుకూ ఎలా తగ్గిపోతూఉందో లెక్కలద్వారా చూపింది. బట్టలపై పన్నులు విధించిన ఫలితంగా వాటిధరలు పెరిగిపోతూ ఉన్నాయనీ, విదేశీయుల పోటీనుంచి తప్పుకోడానికి ఏర్పరచిన రక్షణశ్రేణులకు నిరుద్యోగసమస్య వగైరాలద్వారా ప్రమాదం ఏర్పడిందనీ ఎక్సైజు పన్నుల ఫలితంగా విదేశీ మార్కెట్టులు కోల్పోవలసివస్తుందనీ ప్రకటించింది. ఆ పత్రిక ఇంకా ఇలా వ్రాస్తూ ఉంది :

"గత సోమవారంనాడు అర్థికశాఖామంత్రి ప్రవేశపెట్టినబడ్జెటు వాస్తవిక పరిస్థితులను యథాతథంగా చిత్రిస్తుందని మేము విశ్వసించడల్లేదు. బడ్జెట్‌లో చూపబడిన ఉజ్వల ఆశారేఖలేవీ మాకు దృష్టిగోచరం కావడం లేదు. ఇతరులకుచెల్లించవలసిన మొత్తాలను సరిపుచ్చడంలో భారతదేశ పరిస్థితి విషమంగా ఉంది. అర్థికవిధానంలో ఏర్పడిన అవకతవకకు ఒక ప్రధాన కారణమైన ఆహారపరిస్థితి చాలా అయోమయంగా ఉన్నా తదితరవిషయాల్లో మాత్రం పరిస్థితులు విషమించే సూచనలేవీ లేవు."

పెట్టుబడిదారీవర్గానికి బాకా అయిన ఈ 'ఈస్టర్న్ ఎకానమిస్టు' ఇచ్చేనినాదం ఒకటే. అదే 'అర్థిక మితవ్యయం' (ఎకానమీ) 'నిరూపయోగమైన రక్షణశాఖపై వినియోగించేఖర్చు'కు వ్యతిరేకంగా ఈ నినాదం ఉద్దేశించబడింది. నిర్లక్ష్యంగా నోట్లు ముమ్మరాన్ని పెంచివేయడంద్వారా బడ్జెట్‌లో ఏర్పడిన లోట్లను పూర్తిచేయడం జరిగింది. ఈ బడ్జెట్‌కు మూలసూత్రం ఆర్థిక మితవ్యయం - అతి కఠోరమైన నిర్దాక్షిణ్యమైన మితవ్యయమే - అనీ, ఈ మూలసూత్రంద్వారానే ఆర్థికశాఖామంత్రి తనకూ తనదేశానికీ సముచితన్యాయం కలిగించగలడనీ ఆ పత్రిక ఉద్ఘాటిస్తూ ఉంది.

ప్రజాసామాన్య జీవనస్థాయిపై నిర్దాక్షిణ్యంగా, తగినంత తీవ్రంగా ప్రభుత్వం దాడిసాగించడం లేదనీ, విదేశీపెట్టుబడిదారులకు సంతృప్తి కలిగే విధంగా వ్యవహరించి వారి పెట్టుబడితో ఒక్కసారిగా దేశాన్ని ముంచివేయడం లేదనీ ఈ పత్రిక ప్రభుత్వంపై నేరం ఆరోపిస్తూ ఉంది.

ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు ప్రపంచాధిపత్యంకోసం సాగించే దురాక్రమణ యంత్రంలో తానుకూడా ఒకచిన్న చీల లాగా తయారై తనపలుకుబడిక్రిందకూడా కొంత 'అర్థస్వతంత్ర' ప్రదేశాన్ని అట్టిపెట్టుకోవాలని భారత పెట్టుబడిదారీవర్గం ఉబలాటపడుతూ ఉంది. తమ ఈ కోరిక త్వరగా ఈడేర

డానికి వీలుగా ఆంగ్లో - అమెరికన్ మిలటరిస్టులతో భారతప్రభుత్వం తన సైనిక యంత్రాన్నికూడా పూర్తిగా మిళితంచేసి వేయలేదని వీరు ఆగ్రహావేశ పరవశులవుతున్నారు. దీన్నే 'ఈస్టర్న్ ఎకానమిస్టు' ప్రతిధ్వనిస్తూఉంది.

సైనికవ్యయంలో 37 కోట్లూ, ఆహార సబ్సిడీలలో 10 కోట్లూ, ప్రభుత్వ నిర్వహణ శాఖలో 10 కోట్లూ తగ్గించాలని ఈ పత్రిక సూచిస్తూఉంది.

సైనికవ్యయంలో 37 కోట్ల రూపాయలు తగ్గించాలనేదే ఈ పత్రిక సూచించిన తగ్గింపులన్నిటికంటె పెద్దది. 'తిండి కంటె తుపాకులుముందు' అనే పాలసీని ఇండియాలాంటి పేదదేశం అవలంబించలేదని తేనెబూసిన కత్తిలాగా శ్రీరంగనీతులు వల్లిస్తూఉంది.

'ఈస్టర్న్ ఎకానమిస్ట్' సాగించిన నిరంతరాందోళన ఫలితంగా సామ్రాజ్యవాదుల మధ్యవర్తిత్వాన్ని అంగీకరించి కాశ్మీరులో యుద్ధాన్ని విరమించడం, మలయా ప్రజలకు వ్యతిరేకంగా బ్రిటిష్ సామ్రాజ్యవాదులు సాగించే యుద్ధాన్ని బలపరచడం, బర్మాలో విప్లవ ప్రతిగామి, సామ్రాజ్యవాదుల చేతిలో కీలుబొమ్మ అయిన థాకిన్‌నూ దివాలాకోరు ప్రభుత్వానికి అండగా నిలబడటం, ఇండోనేషియాలో అమెరికా జోక్యం కలిగించుకోవాలని పదేపదే ప్రాధేయ పడడం, 'కామన్‌వెల్త్ రక్షణవ్యూహం'లో చేరి సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్య వాదులకు వంతపాడటం జరిగింది.

ఇక రెండోవిషయం: మిలిటరీవ్యయం విపరీతంగా ఉందని ఎంత గొంతుచించుకున్నా భారత బడాబూర్జువావర్గం సైనిక సంఖ్యను తగ్గించబోవడం లేదనీ, సైనిక యంత్రాన్ని ఎప్పటిలాగే నిర్మిస్తూనే ఉందని గమనించవలసి ఉంటుంది. 'ఆర్థిక మాంద్య కాలంలో ఉపయోగపడే విధముగా మూడు సంవత్సరాలవరకు అన్ని సైనిక శాఖలకు సంబంధించి మొత్తం 120 కోట్ల రూపాయలపై ఇప్పుడే ఒక కాంట్రాక్ట్ బడ్జెట్ నేర్పరచాలి' అని ఈ పత్రిక సూచిస్తూఉంది.

పెట్టుబడిదారీ ప్రభుత్వం ఎంత తంతు నడుపుతూఉందో చూడండి! 'పాకిస్తాన్ ప్రమాదం' నుంచీ, సామ్రాజ్యవాదుల దాడినుంచీ తట్టుకోడం కోసం అనీ 'జాతీయ సర్వస్వతంత్ర ప్రతిపత్తి'ని కాపాడుకోడానికీ, అటు ఆంగ్లో -అమెరికన్లకూ ఇటు సోవియట్ యూనియన్, ప్రజాస్వామిక ప్రజాతంత్ర దేశాలకూ మధ్య 'తటస్థ' విధానాన్ని నిర్వహించడానికీ సైనిక సన్నద్ధత అవసరం అనీ సైన్యాన్ని మొట్టమొదట సంఘటితపరచడం జరిగింది.

భారతదేశం తన రక్షణశాఖకయ్యే వ్యయాన్ని తాను భరించలేదనే సాకుతో ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులతో సైనికసంధిని కుదుర్చుకోడంకోసం ఇప్పటినుంచే పునాదులు వేయబడుతూ ఉన్నాయి. ఆగ్నేయ ఆసియాలో సాగించే విప్లవ ప్రతిఘాతక యుద్ధాల్లో వంట చెరుకుగా ఉపయోగించేందుకు తక్కువ జీతాలతో తగినంతమందిని తన చేతిలో ఉంచుకోడానికీ, భారత ప్రజాసామాన్యంలో చెలరేగుతూన్న విప్లవాత్మక అసంతృప్తి జ్వాలలను చల్లార్చడానికీ, సోవియట్ వ్యతిరేక యుద్ధంలో పాల్గొనడానికి భారతప్రభుత్వం

తన సైనికసంఖ్యను తగ్గించకుండా యథాతథంగా అట్టిపెడుతూ ఉంది.

అసలు ప్రభుత్వమే స్వయంగా ఒక పెద్ద కార్మిక యజమాని. కాబట్టి ముందు తనక్రింద పనిచేసే ఉద్యోగులనూ వారి జీతాలనూ తగ్గించి ప్రభుత్వమే తమకు దారిచూపినచో తమ వ్యక్తిగత పరిశ్రమల్లోకూడా అదేవిధంగా ఆచరించడం సులభసాధ్య మవుతుందని పెట్టుబడిదారులు ప్రభుత్వాన్ని డిమాండ్ చేయడం జరిగింది.

"నిజపరిస్థితిని పరికిస్తే దేశంలో మనిషి 1కి జాతీయాదాయం 1942-43 నుంచి ఏమీ పెరగకపోగా ఇంకా తగ్గిపోయింది. 1939 నాటిజీతాలకంటె ఈనాటి జీతాల నిజమైన విలువ నూటికి 15 నుంచి 20 వంతుల వరకు తగ్గిపోయిందనడం యథార్థంకాదా? లేక ప్రస్తుత పరిస్థితులకు దీనితో సంబంధం లేదా? సివిల్ ఉద్యోగుల జీతాలు ధరలనుబట్టి తరిగినా పెరిగినా వాటిలో కోతకోయకూడదనడానికి అది ఒకచట్టంలాంటిది కాదుగదా?"

ముందు రాబోయే సాధారణ వేతనాల స్థాయికి ప్రభుత్వోద్యోగుల అసలు వాస్తవిక వేతనాలనుకూడా తగ్గించివేయాలని ఈస్టర్న్ ఎకానమిస్టు డిమాండ్ చేస్తూఉంది.

ప్రజాసామాన్యం తిండిలేక పస్తులు పండుకుంటూ ఒకవైపు ఆకలిమంటలతో అలమటించిపోతూఉన్నా ఈ నరభక్షకుల గొంతెమ్మ కోర్కెలకుమాత్రం అంతుండదు. ఆహారసబ్సిడీలను పూర్తిగా తగ్గించివేస్తే విప్లవం ఎక్కడ చెలరేగిపోతుందో అనే భయంకూడా వీరికి లేకపోలేదు. 'ఈస్టర్న్ ఎకానమిస్ట్' దీనిపై ఇలా వ్యాఖ్యానిస్తుంది.

"అనవసరంగా మొట్టమొదట ఆహారపదార్థాలకు సబ్సిడీ ఇవ్వడంలోనే అసలు పొరపాటు జరిగిందనీ ఇప్పుడు ఒకేసారి సబ్సిడీలను ఆపుజేయడం నేటి రాజకీయపరిస్థితులనుబట్టి కష్టతరం అవుతుందనీ మా అభిప్రాయం."

అయినప్పటికీ ధాన్యడిపోలన్నిటినీ క్రమక్రమంగా మూసివేయాలనీ, కరువుభత్యాలను తగ్గించాలనీ, ఆహారపదార్థాల సబ్సిడీలో 10 కోట్ల రూపాయలు తగ్గించాలనీ, ఈ పత్రిక డిమాండ్ చేస్తూ ఉంది. ఆహారపదార్థాలకిచ్చే సబ్సిడీలో కొంతభాగం ఉత్పత్తిసాధనాలుకలిగిఉన్న 'వ్యవసాయదారుల'కు (అంటే పెట్టుబడిదారీరైతులకు,)ధనిక రైతులకు ఇవ్వాలనీ, తద్వారా ఆ వ్యవసాయదారులకు ప్రభుత్వ ఖర్చుతో సరియైన వ్యవసాయ సదుపాయాలు (నూతులు తవ్వించడంవగైరా) కలుగుతాయనీ ఆ పత్రికవ్రాస్తూఉంది.

విదేశీ పెట్టుబడి మన దేశంలో ప్రవేశించడానికి ఎట్టి అంతరాయం కలగకుండా తలుపులు బారలుగా తెరవాలని తుట్టతుదకు తన అసలుకోర్కెను బైటబెట్టింది. అంటే రాజకీయంగా ఆర్థికంగా మన దేశాన్ని ఆంగ్లో అమెరికన్ గుత్తవ్యాపారులకు తాకట్టు పెట్టాలని ఆ పత్రిక ప్రకటిస్తోంది.

'విదేశీ పెట్టుబడి-సహకారం' అనే శీర్షికగల ఒక వ్యాసంలో 'ఈస్టర్న్ ఎకానమిస్టు' ఇలా వ్రాస్తూఉంది.

"విదేశీ పెట్టుబడిని గురించిచర్చించే సందర్భంలో 'పరిస్థితుల' సమస్యపై గతంలో అనవసరంగా ఎక్కువప్రాముఖ్యత ఇవ్వబడింది. విదేశీ పెట్టుబడిని ఆకర్షించడంకోసమే ముఖ్యంగా

ప్రయత్నించేటప్పుడు 'పరిస్థితులను' గురించి విదేశీ పెట్టుబడిపట్ల అవలంబించే పాలసీలో అంతగా ప్రాముఖ్యత చూపడానికి అవకాశం ఉండదు. దీన్నే ఇంకా స్పష్టంగా చెప్పాలంటే విదేశీ పెట్టుబడిదారులకున్న సంకోచాన్నీ సందేహాలనూ పోగొట్టడానికి ప్రయత్నించాలి.

"రాజకీయ ప్రమాదాలను పురస్కరించుకునే ఎక్కువగా ఈ సంకోచాలూ సందేహాలూ కలుగుతున్నాయి. 'అట్లాంటిక్ సంధి' దేశాలతో మన విదేశాంగవిధానం ఎంతగా ఏకీభవించి ఉండవలసిందో అంతగా ఏకీభవించి లేకపోవడమే ఇందుకు కారణం. అమెరికానుంచే మనం ఎక్కువ పెట్టుబడినీ, సహకారాన్నీ అపేక్షిస్తున్నాము. కాబట్టి అమెరికా వ్యాపారులతో మన విదేశాంగ విధానం పూర్తిగా సరితూగవలసి ఉంటుంది. ఇండియాను రిపబ్లిక్‌గా ప్రకటించడం నేడున్న రాజకీయ అస్థిరత్వాన్ని మరింత ఎక్కువచేస్తుంది. కాబట్టి ఈపరిస్థితుల్లో ప్రస్తుతం సంప్రదింపుల్లో ఉన్న నౌకాయాన (నావిగేషన్) సంధినీ, వాణిజ్య సంధినీ, త్వరగా కుదిరించుకోడంవల్ల మున్ముందు మన కోరిక లీడేరే అవకాశాలున్నాయి."

(1949 మార్చి 25)

ప్రభుత్వాధికారాన్నీ, కోట్లకొలది భారతప్రజల జీవన్మరణ సమస్యనూ తన గుప్పెట్లో చిక్కించుకున్న భారత పెట్టుబడిదారీవర్గం అమెరికా పెట్టుబడిదార్లతోనూ, బ్రిటిష్ పెట్టుబడిదారులతోనూ పొత్తు కలసి జాయింటుగా పరిశ్రమలు స్థాపించాలని తహతహలాడుతూ ఉంది. ఆ పరిశ్రమల్లో - ఆ దోపిడిలో-ఎక్కువ భాగం ఆంగ్లో అమెరికన్ పెట్టుబడిదారులకు కట్టబెట్టి తనకు లభించే కొద్ది భాగంతో తాను సంతృప్తిపడాలని చూస్తూఉంది. ప్రభుత్వ యంత్ర సహాయంతో కార్మికులనూ శ్రమజీవులనూ కొల్లగొట్టి తన విదేశీ భాగస్వాములకు విపరీత లాభాలు ముట్టచెప్పాలని ప్లాను వేస్తూఉంది భారత పెట్టుబడిదారీ వర్గానికి ప్రభుత్వాధికారం సంక్రమించిన లగాయితు వాణిజ్యమండలి సభలలో సమావేశాల్లో ఇదేవిషయంపై ఉపన్యాసాలు జరుగుతున్నాయి. తీర్మానాలు చేయబడుతున్నాయి.

విదేశీ పెట్టుబడినిగురించి ఇటీవల మత్తాయ్ ఇచ్చిన ప్రసంగంపై 'ఈస్టర్న్ ఎకనమిస్టు' ఇలా వ్యాఖ్యానించింది.

"విదేశీ పెట్టుబడి అనే భూతాన్ని గురించి వ్యాపించి ఉన్న భయసంకోచాలన్నీ మంత్రిగారిచ్చిన ఉపన్యాసం ద్వారా పటాపంచలై పోయాయి......" 25_3_49

విదేశీ పెట్టుబడిదారులతో భారత పెట్టుబడిదారులు కలిసి స్థాపించబోయే పరిశ్రమలలో భారత పెట్టుబడికి నూటికి 25 వంతులకు మించకుండా స్థానమిస్తే సరిపోతుందనీ "ఎవరి పెట్టుబడి ఎంత ఉండాలి, విదేశీ వ్యక్తులెందరుండాలి, ఎవరికి శిక్షణ ఇవ్వాలి మొదలైన విషయాల్లో కఠినమైనషరతు లుండగూడద"నీ ఆ పత్రిక వ్రాస్తూఉంది. అంటే అమెరికన్ బ్రిటిష్ పెట్టుబడిదారులతో కలిసి యథేచ్ఛగా పరిశ్రమలు నెలకొల్పుకోడా

నికి ఎటువంటి అభ్యంతరం ఉండరాదన్న మాట. ప్రభుత్వాధికారం ఇంకా భారత బూర్జువావర్గానికి సంక్రమించకపూర్వం 1944లో బిర్లా, ఆతని పత్రిక 'ఈస్టర్న్ ఎకనమిస్టు' విదేశీ పెట్టుబడిదారులకు స్వదేశీ పెట్టుబడిదారులకు పెట్టుబడిలో, యాజమాన్యంలో చెరిసగం వాటాలుండాలి అని తీవ్రంగా వాదించారు. కాని ఇప్పుడో! వచ్చే లాభాల్లో నాలుగోవంతు ఇస్తే చాలు సంతృప్తిపడతాం అంటున్నారు.

# V

భారత భారీ పెట్టుబడిదారులకు 'మాంద్యం' దరిదాపు చేరువైందని పూర్తి నమ్మకం కల్గింది. ఈ మాంద్యంనుండి బయటపడి తన స్వార్థం యీడేర్చుకోనేందుకు తమస్థితిని పటుతరం చేసుకొనేందుకు యీ మాంద్యపు భారాన్నంతా పేదప్రజల నెత్తిన కొట్టడానికి భారీ పెట్టుబడిదారులు సిద్ధంగా వున్నారు.

1949 మార్చి 4 న ఢిల్లీలో జరిగిన వాణిజ్యమండలి సభలో మాట్లాడుతూ జి. డి. బిర్లా యిలా అన్నాడు.

"భారతదేశాన్ని మాంద్యంవెనువెంటనే ఎదుర్కోబోతున్నప్పటికి, యీ మాంద్యపురోజుల్లోనే మనం పరిశ్రమలను స్థాపించుకోవాలి" (1949 మార్చి 5 అమృతబజారు పత్రిక.)

బిర్లాకు నాలుకగా పనిచేస్తున్న 'ఈస్టర్న్ ఎకనమిస్టు' ప్రభుత్వం ప్రజలపైన నెరపుతున్న పాసిస్టు దాడి చాలా పేలవంగా, వుందని, ప్రభుత్వం ప్రజావ్యతిరేక చర్యల విషయంలో ధైర్యం చేసి ముందడుగు వేయలేక పోతోందని, రాజకీయ సమాలోచనలకు అనవసర ప్రాముఖ్యత ను అంటకడుతోందని ప్రభుత్వంపైన అభియోగం తెచ్చింది.

అది యిలా వ్రాసింది:

"పరిపాలన విషయంలో దుబారా వ్యయం, ఆహారధాన్యాలకు సబ్సిడీలు, అభివృద్ధి ప్రణాళికల -అవిఏవో ఎవరికీ తెలియవు - విషయంలో అనవసరపు ఖర్చులు, యింకా కాందిశీకులు మొదలుగాగల చిన్న విషయాలలో జరుగుతున్న దుబారాలన్నీ రాజకీయంగా యిష్టపడుతున్నారు. ఏదేశప్రభుత్వమైనా ఓట్లపైననే మనుగడను సాధించదలచుకొంటే, ఓట్లు సంపాదించుకోవలసిన కారణంగానే ఆ ప్రభుత్వం ఖచ్చితమైన ఆర్థిక విధానాన్ని అనుసరించ వీలుపడదు ఇది మనకు యిట్టే అర్థమౌతుంది. దేశంలో ఎక్కడా ఆర్థికాభ్యుదయం సాధించకుండానే, ప్రభుత్వం దుబారా ఖర్చులు పెట్టినంతమాత్రంచేత ఎక్కడైనా ఓట్లు సంపాదించగల్గుతుందా?" (14, మార్చి 1949)

పెట్టుబడిదారీ ప్రభుత్వానికి రాజకీయంగావున్న పేరుప్రతిష్ఠల ప్రాబల్యాన్నంతా - సాధ్యమైనంతవరకు ఎక్కువగా ఉపయోగించుకోవాలని ప్రతి పెట్టుబడిదారీ ప్రభుత్వం ఆశిస్తూ వుంటుంది — ఉపయోగించుకొని, ప్రజలను యథేచ్ఛగా దోపిడీ చేయమని యీ పత్రిక వాదం.

ఈ పత్రిక యిలా హెచ్చరిస్తోంది:

"భారతదేశంలో నేటిప్రభుత్వంలాగా ప్రజల భక్తివిశ్వాసాలను చూరగొన్న

ప్రభుత్వంగతంలోఎన్నడూలేదు.ఇంకా స్పష్టంగా చెప్పాలంటే అదృష్టవశాత్తు ఇంతగా ప్రజాభిమానాన్ని చూరగొన్న ప్రభుత్వం యికముందుగూడ అవతరించ బోదు. ఈ ప్రజాభిమానం పైకిపొక్కని దైనప్పటికి, దేశం నలుమూలల అసం ఖ్యాక ప్రజలఅభిమానాన్ని సంపాదించు కొంది. ఈ ప్రభుత్వం- ఇది ప్రజా ప్రభుత్వం అయినా, కాకపోయినా సత్యాన్ని భారత ప్రజలకుచెప్పగలదు-"

వాణిజ్య మండలి సభలో మాట్లా డుతూ పెట్టుబడిదార్లకు ఆయుధాలు యివ్వాలనే కోర్కెను స్ఫురింపచేస్తూ బిర్లా మాట్లాడాడు. "వ్యాపారస్థులు ధైర్య సాహసాలను ప్రదర్శించాలి" అంటూనే, యింకోప్రక్క ప్రభుత్వానికి ఒక హెచ్చరిక చేశాడు:

"దేశాభ్యుదయాన్ని సాధించటా నికి కావలసిన అనుభవం, నేర్పరితనం ప్రస్తుత ప్రభుత్వానికి పూర్తిగాలేవు. ఇట్టి అనుభవం, నేర్పరితనం కలవారి సహాయం పొందకుండా, దేశాన్ని ఎదుర్కొనే ప్రమాద పరిస్థితినుంచి గట్టెక్కడం దుస్సాధ్యం ... శాంతి భద్రతలను కాపాడేందుకు కావాల్సిన జనం ప్రభుత్వానికున్నారు. కాని అనుభవజ్ఞులైన ఆర్థికవేత్తలు ప్రభు త్వంలో లేరు. ఈ ఆర్థికవేత్తలు మాత్రమే ప్రభుత్వంపొందిన అపజయా లనుగూర్చి సాకల్యంగా వివరించ గలరు"

గత సంవత్సరం పొడుగునా భారత కార్మికవర్గం, యితర కష్టజీవులుకూడ పెట్టుబడిదారులయొక్క రక్తదాహం ఎట్టిదో పూర్తిగా తెలుసుకోగల్గారు. కనుకనే కార్మికవర్గం అప్రతిహతమైన, మహోన్నతమైన, చిరస్మరణీయమైన పోరాటాలకు నాయకత్వంవహించి నడి పింది. సంక్షోభ భారమంతా ప్రజల నెత్తిన పడకుండా వుండేందుకుగాను, ప్రభుత్వం చేసే దాడిని తీవ్రంగా ప్రతిఘటిం చింది. ఈవిధంగా తీవ్రతరమయ్యే సంక్షోభ భారం ప్రజల నెత్తిన పడ కుండా కొంతకాలంవరకు వాయిదా వేయించగల్గింది. దీనితో పెట్టుబడిదారు లకు గంగవెర్రులెత్తాయి.

పెట్టుబడిదారీవర్గం యీ సంవత్సరం రెచ్చిపోయిన పిచ్చికుక్కలాగా యింకా విరుచుకపడబోతోంది. ఉరకలు తీస్తూ వస్తున్న మాంద్యాన్ని అధిగమించటం కోసం సంక్షోభపు భారాన్నంతా పేద ప్రజానీకంపైన పడవేసి కుళ్లి కంపుకొట్టు తున్న పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థను రక్షించుకోవటం కోసం, అవుసరమైతే రక్తవాహినులను పారించి, ఆకలిమంట లను, దారిద్ర్యాన్నీ, మరణాలను అధికం చేస్తూ, తమ స్థితిగతులను శాశ్వతంగా కట్టుదిట్టం చేసుకోవటంకోసం పెట్టుబడి దారీవర్గం తమ శక్తులనన్నిటినీ సైనిక సిద్ధాంతాలపైన సమీకరించుకొంటోంది.

ప్రమాదకరమైన యీ దుందుడుకు ప్రయత్నాన్ని జయప్రదంగాసాగించేందుకు ఆంగ్లో-అమెరికన్ వాటాదార్లకు లాభా లను పంచియిచ్చి, తద్వారా యీ గండం గడిచి గట్టెక్కాలని భారత పెట్టుబడిదార్లు వాంఛిస్తున్నారు. విదేశ ఆర్థిక 'సహాయం' రాబట్టుకోవటంకోసం భారత దేశాన్ని ఆంగ్లో - అమెరికన్ రాజకీయ, సైనిక ఆర్థిక విధానంతో మిళితం చేయటానికి వేగిర పడుతున్నారు.

భారతదేశ సరిహద్దులను చుట్టు ముట్టుకు వస్తున్న విప్లవజ్వాలలను ఛూచి

భారత దేశంలోనే వెల్లివిరుస్తున్న విప్లవ చైతన్యాన్ని కాంచి పెట్టుబడిదారీవర్గం భయకంపితమౌతుంది. భారత ప్రజల విప్లవ ప్రతిఘటనను సమూలంగా నిర్మూలించటానికి. సోవియట్ ఆధిపత్యాన పురోగమిస్తున్న సోషలిస్టు ప్రజాతంత్ర శక్తులపై యుద్ధాన్ని సాగించటానికి, భారత పెట్టుబడిదారీ వర్గం అంతర్జాతీయ పెట్టుబడిదారీ వర్గంతో వివిధ యుద్ధ సంఘులరూపంలో ఒకసంయుక్త సంఘటన నేర్పచటానికి తయారైంది.

కాని ప్రభుత్వానికి, పెటుబడిదార్లకు ఒక హెచ్చరిక :

కార్మికవర్గ నాయకత్వాన, స్థానిక పోరాటాలలో రాటుతేలుతున్న భారత ప్రజానీకం తప్పనిసరిగా పెట్టుబడిదారీ వర్గంచానితొత్తులుకంటున్న మధురస్వప్నాలను మొగ్గలో నేత్రుంచి వేస్తుంది.

తస్మాత్ ! జాగ్రత్త !!

[మార్చి-ఏప్రిల్ కమ్యూనిస్టు నుండి]

## తండ్రీ! మమ్ములను ఆశీర్వదించు



బ్రిటిష్ కామన్వెల్తుతో ఇండియా పొత్తు భారత రాజ్యాంగ పరిషత్తు ఆమోదం పొందింది.

సంపాదకీయం:



# షాంగ్ హై విముక్తి

షాంగ్ హై విజయవార్త సమస్త ప్రపంచాన్నీ ఊపివేసింది.

మే 25 వ తేదీన చైనా ప్రజాసైన్యం ప్రపంచంలో నాలుగో పెద్దపట్టణమయిన షాంగ్ హైను విముక్తం చేసింది. షాంగ్ హై జనాభా 60 లక్షలు. 893 చదరపుమైళ్లవిశాలం. చైనాదేశం మొత్తంలో ఎక్కువ పారిశ్రామికమైన పట్టణమిదే. ఈపట్టణంలో విశ్వవిద్యాలయాలూ, కళాశాలలూ, టెక్నికల్ స్కూళ్లూ మొత్తం 30 ఉన్నాయి. వర్కుషాపులూ, ఫ్యాక్టరీలూ 13562 వరకూ ఉన్నాయి. ఈపటణంలో పనిచేసే మొత్తం కార్మికుల సంఖ్య 8 లక్షలు. చైనాదేశంలో ఉన్న వివిధ పరిశ్రమల సారమంతా పేరుకొన్న స్థలమే షాంగ్ హై.

మొత్తం చైనాదేశానికి షాంగ్ హై జీవనాడి లాంటిది. ఇప్పటికి దాదాపు వందసంవత్సరాలనుంచి పరాయిసామ్రాజ్యవాదుల పదఘట్టన క్రిందిబడి నలిగిపోయిన షాంగ్ హై నేటికి మళ్లీ చైనా ప్రజలచేతుల్లోకి వచ్చిందనగానే ప్రపంచ ప్రజా హృదయాలు ఆనందాతిరేకంతో ఉప్పొంగిపోయాయి. బ్రిటిష్. అమెరికా సామ్రాజ్యవాదుల గుండెలు నిలువునా క్రుంగిపొయ్యాయి. షాంగ్ హైలోని ప్రధాన పరిశ్రమలన్నీ విదేశీసామ్రాజ్యవాదుల స్వాధీనంలోనే - అమెరికాకంటె కూడా ఎక్కువగా బ్రిటిష్ సామ్రాజ్యవాదులచేతుల్లోనే - ఉన్నాయి. షాంగ్ హైకు అసలు చైనారూపే లేకుండా పోయింది. అణువణువునా అక్కడ విదేశసామ్రాజ్యవాదప్రభావం ద్యోతకమవుతుంది. కాబట్టే షాంగ్ హై విజయాన్ని అమెరికా పత్రికావిలేఖరులు "ఇదొక మహావిషాదకర వార్త" అని ప్రకటించారు.

ఛియాంగ్ కైషేక్‌గారి "స్టాలిన్‌గ్రాడ్" అయిన షాంగ్‌హై పడిపోయిన వెంటనే యుద్ధమేఘాలు కాంటన్‌పై ముసురుకోసాగాయి. క్యూమింటాంగ్ ఇంకా ఎంతోకాలం నిలిచి యుద్ధం చేస్తుంది అనుకునే వాళ్ళు కేవలం మూర్ఖులు మాత్రమే.

సమస్త మానవజాతి విముక్తికి షాంగ్‌హై విజయం ఒక పెద్దసోపానం లాంటిది. దూరప్రాచ్యంలో ఉన్న సామ్రాజ్యవాదుల ఒక ప్రధానకోట కూలిపోయింది అయినా సామ్రాజ్యవాదులు ఇంతటితో తమ దోపిడి విధానానికి బుద్ధిపూర్వకంగా స్వస్తి చెప్పుతారనుకోడం శుద్ధ తెలివితక్కువ. చివరదాకా వాళ్లు తమ ప్రయత్నాలు సాగిస్తూనే ఉంటారు. కుట్రలు పన్నుతూనే ఉంటారు. అమెరికానుంచి ఆహారపదార్థాలూ, ప్రత్తి, వంటచెరుకు, నూనెలు సప్లయిగాకపోతే షాంగ్‌హై ప్రజలంతా పస్తులు పడుకోవలసిందే అనీ – ఇప్పటికే చాలామంది పస్తులు పడుకుంటూనే ఉండవచ్చుననీ– వాళ్లు తియ్యటి కలలు గంటున్నారు.

కమ్యూనిస్టులు పల్లెలనే కాని పట్టణాలను పరిపాలించ లేరని మరొక తప్పుడు ప్రచారం చేస్తున్నారు. ఇప్పటికే కమ్యూనిస్టుల చేతుల్లో ఉన్న హార్బిన్, ముక్డెన్, కాల్గన్, పీపింగ్, టీన్‌ట్సిన్ వగైరా పట్టణాల్లో పరిపాలన ఎంత దిగ్విజయంగా కొనసాగిపోతూ ఉందో వాళ్లు కానలేకుండా ఉన్నారు. కమ్యూనిస్టుల విజయానికి అసలు ప్రధాన కారణమేమిటో వాళ్ళ మందబుద్ధికి ఇంకా తట్టడం లేదు.

ఏమాత్రం ప్రజా సహకారం లేని క్యూమింటాంగ్ ప్రభుత్వం 60 లక్షలమందికి తిండి సప్లయిచేయడమంటే దానికి తలప్రాణం తోకకు వచ్చినమాట వాస్తవమే. (1926–27 లో జరిగిన మహావిప్లవంలో చైనా కార్మికవర్గం వార్‌లార్డ్ ... శేషంగా షాంగ్‌హై
ఆక్రమణలో క్యూమింటాంగ్ ప్రభుత ... డింది.
కాని ఛియాంగ్ కైషేక్ ప్రభుత...
తర్వాత ఆ ఆక్రమణలో తన...
కార్మికులనూ విద్యార్థులన...

చిత్రవధ చేసింది. కాబట్టి అలాంటి ప్రజాద్రోహికి ప్రజాసహకారం లభించకపోవడంలో ఆశ్చర్యం లేదుకదా!) కాని కమ్యూనిస్టుల విషయంలో అలాంటి సందేహానికి తావు లేదు.

కమ్యూనిస్టుల విజయానికి కారణభూతమైన ప్రజాసహకారమే ఇలాంటి సమస్యలన్నిటినీ సుళువుసూత్రంగా పరిష్కరించి వేస్తుంది. కమ్యూనిస్టుల అధీనంలో ఇదివరకే అత్యంతవిశాలవంతమైన వ్యావసాయిక ప్రదేశం ఉంది. కమ్యూనిస్టుపార్టీ అమలు పరచిన వ్యవసాయ సంస్కరణల ద్వారా నూతనోత్సాహం పొందిన కోట్లకొలది రైతులు తమ సోదరప్రజలైన పట్టణవాసులకు సహాయం చేయడానికి సర్వదా సిద్ధంగా ఉన్నారు. మే నెల 29 వ తేదీకే షాంగ్‌హైనగరానికి 2 వేల టన్నుల ఆహారపదార్థాలూ, బొగ్గూ, నూనె సప్లయిచేయబడింది. సామ్రాజ్యవాదుల ఆశలన్నీ త్వరలోనే నిరాశలవుతున్నాయి.

నేడు ప్రజలచేతుల్లో ఉన్న పట్టణాలన్నిటికంటె పెద్దది అయిన షాంగ్‌హై మూడు పువ్వులూ ఆరుకాయలుగా దినదినప్రవర్ధమానమవుతుంది. అదిసమస్తమానవజాతికి ఒక నూతన ఆశాజ్యోతిగా వెలుగొందుతుంది.

---

# ॥ శ్రమజీవుల శ్రేయస్సే ॥

## అభ్యుదయ రచయితల పరమావధి

**అఖిలభారత అభ్యుదయ రచయితల అయిదవ మహాసభ సందేశం**

అఖిలభారత అభ్యుదయ రచయితల సంఘసమావేశం మేనెల చివరవారంలో బొంబాయిలో నాలుగురోజులపాటు జరిగింది. ఈ సమావేశం ప్రకటించిన మానిఫెస్టోలో ప్రజాస్వామిక భావాలుగల రచయితలందరు ప్రజలపక్షాన – శాంతిప్రజాస్వామిక సోషలిస్టు శక్తులశిబిరంలో–ఉండి కృషిచేయాలనీ, తుప్పుబట్టిపోయిన పాతభావాలనూ, 'కళకోసమేకళ' అనే వాదాన్నీ గతానుగతిక తత్వాన్నీ (ఫార్మలిజం) తమ సర్వశక్తులూ ధారవోసి ఎదిరించవలసిందని యిలాంటి సిద్ధాంతయుద్ధాలనే ఉపయోగించి ఆంగ్లో – అమెరికన్ పెట్టుబడిదారులకు విపరీతంగా లాభాలు కట్టిపెట్టడంకోసం యుద్ధంలో భారతీయ ప్రజాసామాన్యాన్ని వంటచెరకుగా ఉపయోగించజూచే ఇండియా పాలకుల ఆటలను తమ సర్వశక్తులూ ధారవోసి కట్టించవలసిందనీ విజ్ఞప్తిచేయబడింది.

అఖిలభారత అభ్యుదయ రచయితల సంఘ ప్రతినిధుల సమావేశానికి కూడా బొంబాయి ప్రభుత్వం అనుమతి ఇవ్వ నిరాకరించింది. అందువల్ల బొంబాయి పట్టణం సరిహద్దుల కవతల భివండి (థానజిల్లా) లో మేనెల 27 వ తేదీనుంచి 80 వ తేదీ వరకు ఈ సమావేశం జరిగింది.

## సోవియట్ ప్రతినిధులకు అనుమతి నిరాకరణ

సోవియట్ యూనియన్ నుంచి ఈ సమావేశానికి రాగోరిన సోవియట్ రచయితలకు మాస్కోలోనున్న రాయబారి ప్రయాణానుమతి పత్రాలను ఇవ్వ నిరాకరించాడు. అసలు ఈ సమావేశం జరగబోవడంలేదని సోవియట్ రచయితలకు మాస్కోలోని భారతరాయబారి తెలియపరిచాడు.

సుప్రసిద్ధ విజ్ఞానశాస్త్రవేత్త అయిన జ్యూలియట్ క్యూరీ, మహాకవి ఆరగాన్, ప్రపంచ ప్రసిద్ధగాయకుడు పాల్ రాబ్సన్ విఖ్యాత నాటకకర్తసీన్ఓ కేసీలనుంచి పాకిస్తాన్ అభ్యుదయ రచయితల సంఘం నుంచీ ఈ సమావేశాన్ని అభినందిస్తూ సందేశాలు వచ్చాయి.

ఉర్దూభాషలో సుప్రసిద్ధ కథారచయిత అయిన కృష్ణచందర్, ఇంగ్లీషులో విఖ్యాతనవలా రచయితఅయిన శ్రీ ముల్కరాజ్ ఆనంద్, బెంగాలీ విమర్శకుడు సుశీలజనా, హిందీ విమర్శకుడు డాక్టర్ రామబిలాసశర్మలు ఈ సమావేశానికి అధ్యక్షత వహించారు. ఉర్దూలో ప్రసిద్ధ కథారచయిత అయిన ఇస్మత్ చుగ్తాయిగారు సమావేశానికి వచ్చిన ప్రతినిధులందరికీ ఆహ్వానసంఘం తరఫున స్వాగతం ఇచ్చారు.

సుప్రసిద్ధ 'మాభూమి' నాటక రచయితల్లో ఒకరైన భాస్కరరావుగారి ప్రసంగం మొత్తం సమావేశానికే ఒక నూతన జీవం పోసింది. ఆంధ్రలో జరుగుతూన్న హృదయ విదారకర నిర్బంధ చర్యలను ఒక్కొక్కటే పేర్కొని కండ్లకుగట్టినట్లు వారు చిత్రిస్తూ ఉంటే మొత్తం సభికులంతా కన్నులవెంట నీరు గార్చారు.

"మా గ్రామంలో నాతో పాటు దాదాపు 700మంది ప్రజలు లాఠీచార్జికి గురిఅయ్యారు. అనేక మంది పురుషులతోపాటు 20 మంది స్త్రీలుకూడా అరెస్టు చేయబడ్డారు. వీరిలో గర్భవతులూ, పసిపిల్ల తల్లులుకూడా ఉన్నారు. వీరందరిపై టక్కరి కేసులు బనాయించి వీరిని శిక్షించడం జరిగింది. కండ్లు కనపడని వృద్ధుడైన మా తండ్రిగారుకూడా శిక్షింపబడిన వారిలో ఒకరు. ప్రాచీన తెలుగు సాహిత్యంపై నేను వ్రాసిన పుస్తకం వ్రాత ప్రతిని ధ్వంసం చేసి వేశారు.

తెలంగాణాలో దాదాపు 25 సంవత్సరాలనుంచి ఆంధ్ర ప్రజల సంస్కృతీ శ్రేయస్సులకై పాటు పడుతూఉన్న ఆంధ్రమహాసభను నిషేధించారు తెలంగాణా ప్రజలు నేడు అనేక దారుణ దురంతాలకు గురిఅవుతున్నారు. గ్రామస్తులందరిని ఒకచోట 'మంద' వేసి హింసించడం జరుగుతూఉంది. ఒకరిపురుషాంగాన్నికోసి

మరొకరి నోట్లో పెట్టడం వగైరా అనేక ఫాసిస్టు కిరాతక కృత్యాలు అమలు జరుపబడుతూ ఉన్నాయి. కృష్ణాజిల్లా అంతా నేడు ఒక సాయుధ పోలీసు శిబిరంగా మారి పోయింది. వాక్సభాస్వాతంత్ర్యాలెప్పుడో ఎగిరిపోయాయి ఈ ఫాసిస్టు నిర్బంధ విధానం ఎంత తీవ్రంగా ఉన్నా ప్రజలు తమ హక్కులకోసమై ప్రతిఘటించి పోరాడుతూనే ఉన్నారు. ఈ ప్రతిఘటనోద్యమానికి తెలంగాణా రైతు అగ్రశ్రేణిలో నిలబడి నాయకత్వం వహించి నడుపుతున్నాడు. పురోగమిస్తున్నాడు. విజయం సాధిస్తున్నాడు.'' అని చెప్పి భాస్కరరావుగారు తమ ప్రసంగాన్ని ముగించారు.

## హిందీ

తర్వాత శ్రీరామవిలాసశర్మగారు హిందీ సాహిత్యంపై రిపోర్టునిచ్చారు. అభ్యుదయరచయితలు ఏవిధంగా ఫాసిస్టు వ్యతిరేకయుద్ధంలో సక్రమపంథా నవలంబించారో, తెలియజేశారు. సోవియట్ యూనియన్నూ, చైనా ప్రజాస్వామికాన్ని, ఆగ్నేయ ఆసియా ప్రజావిముక్తి పోరాటాలనూ ఏవిధంగా బలపరిచారో - బలపరుస్తున్నారో - చెప్పారు.

బెంగాల్ ప్రజలు భయంకరమైన కరువు గురిఅయినప్పుడూ, మతకలహాల మహామారి ప్రళయతాండవం చేస్తున్నప్పుడూ అభ్యుదయురచయితలు ఏవిధంగా తమ కర్తవ్యాన్ని నిర్వహించారో పేర్కొన్నారు.

అనేక రకరకాలైన మేలిముసుగుల క్రింద కొందరు హిందీ రచయితలు అభివృద్ధి నిరోధకులకు తోడ్పడడాన్ని శర్మగారు తీవ్రంగా విమర్శించారు. ఆకలిమంటలతో నకనకలాడుతూ ఉన్న పొట్టలకు సుమిత్రానందన్ పంత్ ఆధ్యాత్మికవాదాన్ని (మిస్టిసిజం) నూరి పోస్తున్నాడు. సత్యహింసల పేరిట వర్గసామరస్యాన్ని ప్రబోధిస్తున్నాడు. రచయితల వ్యక్తిత్వాన్ని గురించి పదేపదే ఘోషించే 'అజ్ఞేయ' శరణార్థి అనే తన కథలపుస్తకంలో మతకలహాల విషయంలో బ్రిటిష్ ప్రభుత్వ వైఖరిని సమర్థించబూనుకున్నాడు. ఇదివరకుకూడా అప్పుడప్పుడు తిరోగమన లక్షణాలను (రివైవలిస్టు టెండెన్సీ) ప్రదర్శిస్తూ వచ్చిన రాహుల్ సాంకృత్యాయన్ ప్రజల్లో చీలికలు కలిగించడానికి నేడు భాషాసమస్యనొక ఆయుధంగా ప్రయోగిస్తున్నాడు. కేంద్రప్రభుత్వ సమాచారశాఖా పత్రికఅయిన "ఆజ్ కల్"లో నెహ్రూ ప్రభుత్వాన్ని గురించి బహాటంగా భట్టుపొగడ్తలు ప్రారంభించాడు. కాని నాగార్జున్, కేదార్‌నాథ్ శంకరశైలేంద్ర వగైరా అభ్యుదయ రచయితలు ఈ దిగజారుపోకడల నెదిరించి శాంతి, ప్రజాస్వామ్య, సోషలిజాలకోసం సాహిత్యరంగంలో తీవ్రంగా కృషిచేస్తున్నారు.

## ఉర్దూ

డాక్టర్ అబ్దుల్ అలీం ఉర్దూ సాహిత్యంపై తన రిపోర్టునిస్తూ ఇలా చెప్పాడు:

పందొమ్మిదవ శతాబ్దపు రచనల్లోని ప్రజాస్వామిక భావాలనూ వాటి నియ

మితపరిమితులను సోదాహరణంగా చూపాడు. పాక్షికదృష్టితో చూచి ఒకప్పుడు ఇక్బాల్‌ను ఫాసిస్టు అని మరొకప్పుడు అభ్యుదయ రచయితఅనీ సరియైన కారణాలు చూపకుండానే తెగడడం, పొగడడం జరిగింది. ప్రజలపట్ల నేడు కూడా తనకు విప్లవాత్మక సానుభూతి ఉంది అని చెప్పుకొనే జోష్ (మలిహాబాదీ) కేంద్రప్రభుత్వ సమాచార శాఖా పత్రిక అయిన 'ఆజ్ కల్' సంపాదకుడుగా పనిచేస్తూ ఉన్నందుకు డాక్టర్ అలీమ్ తీవ్రంగా విమర్శించాడు. ఒకప్పుడు పెద్ద అతివాదిగా నటించిన అహమద్ ఆలీ శత్రుశిబిరంలో చేరిపోయి పాకిస్తాన్ ప్రభుత్వంలో విదేశాలకు సంబంధించిన, ప్రచురణాధికారిగా పని చేస్తూ ఉన్నాడని చెప్పాడు. పాకిస్తాన్‌లో ఉర్దు మాతృభాషగాలేని ప్రజలపై ఉర్దుభాషను బలాత్కారంగా రుద్దుతూ ఉన్న పాకిస్థాన్ ప్రభుత్వచర్య నెదిరించి పాకిస్తాన్ అభ్యుదయ రచయితలు పోరాడుతూ ఉన్నందుకువారిని శ్లాఘించాడు.

ఇండియాలో ఉన్న కృష్ణచందర్ లాంటి ఉర్దూరచయితలు శ్రామిక ప్రజలకండగా నిలబడి తద్వారా ప్రజాశ్రేయస్సు కోసం, సాహిత్యాభివృద్ధికోసం, తీవ్రంగా కృషిచేస్తున్నారని చెప్పి డాక్టర్ అలీం తన రిపోర్టు ముగించాడు.

## బెంగాలీ

బెంగాలీ సాహిత్యాన్ని గురించి నరహరికవిరాజ్ మాట్లాడుతూ బెంగాల్‌లో మార్షల్ ప్లానూ అమెరికాసంస్కృతినీ ఆరాధించే వారిని గురించి తీవ్రంగా విమర్శించాడు. సమ్మె విచ్ఛిన్నకులను తన కథానికల్లో మహావీరులుగా చిత్రించే 'వనఫూల్' బానిసబుద్ధిని నిరసించాడు. మణిక్ బెనర్జి, నలినీభౌమిక్, నవేందుఘోష్, సుశీలజనారచనలు ప్రజాజీవితాన్ని చిత్రిస్తున్నాయి అని చెప్పాడు.

## పంజాబీ, సింధీ

పంజాబీ సాహిత్యాన్ని గురించి హర్నామ్‌సింగ్ నాజ్ ఇచ్చిన రిపోర్టు పైనా, సింధీ సాహిత్యంపై రామ్ ఇచ్చిన రిపోర్టు పైనా జరిగిన చర్చల్లో ఉభయభాషల్లో ఉన్న ప్రజాకవిత్వంపై కవుల దృష్టి ఆకర్షించబడింది. ఈ చర్చల్లో పాల్గొన్న రాజేంద్రసింగ్ వేదీ, సహీర్ లూధియానవీ, రామ్‌లు శీలాభాటియా, పరదేశి, లేక్‌సింగ్‌ల పంజాబీ, సింధీ రచనల ప్రాముఖ్యతను చక్కగా వివరించారు.

## తెలుగు

నూతన జీవితంకోసంపోరాడుతూ ఉన్న తెలంగాణా రైతుల పోరాటాన్నిచిత్రిస్తూ కొత్తగా నాటకాలూపాటలూ తెలుగులో ఎలా వెలువడుతున్నాయో ప్రయాగ కోదండరామశాస్త్రిగారు తెలుగు సాహిత్యంపై ఇచ్చిన రిపోర్టులో వివరించారు. ప్రజలపై మద్రాసు ప్రభుత్వం సాగిస్తోన్న దారుణ హింసాకాండను గురించి తెలియజేశారు. ఒకప్పుడు స్వయంగా తాము చూచి పొగడిన 'మాభూమి'ని ఆ కాంగ్రెసు మంత్రులే తర్వాత కొద్దిరోజులకు నిషేధించారు. బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడిన స

సీతారామరాజులాంటి ఆంధ్ర జాతీయ వీరునిపై వ్రాయబడిన బుర్రకథను సైతం అణచివేశారు. ఎన్ని నిషేధాలు ప్రయోగించినా నిర్బంధ విధానం ఎంత తీవ్రంగా ఉన్నా ప్రజాసాహిత్యం నూతన రూపంలో నూతన శోభతో ముందుకు సాగిపోతూఉంది. అని ప్రయాగ తన రిపోర్టును ముగించారు.

ఈ సమావేశంలో అమితోత్సాహంతో పాల్గొనవలసిన బలరాజ్ సహానీ, అలీసర్దార్ జాఫ్రీ, అమరషేక్, హాజరాబేగం, రషీద్ జహా, లాంటివారు కాంగ్రెసు జైళ్ళల్లో డిటెయిన్ చేయబడడంవల్ల ఈ సభకు హాజరుగాలేక పోయారు.

## మానిఫెస్టో

సామ్రాజ్యవాదయుద్ధోన్మాదులకూ, వలసదేశాల్లోఉన్న వారి మిత్రులకూ వ్యతిరేకంగా ప్రజాస్వామికంకోసం, శాంతికోసం జరుగుతూఉన్న ప్రపంచ వ్యాపిత యుద్ధంవైపు ఈ సమావేశంలో ఆమోదించబడిన మానిఫెస్టో సభ్యులదృష్టిని పూర్తిగా ఆకర్షించింది.

సాహిత్యంలో పరంపరాగతంగా వస్తూఉన్న ప్రజాస్వామిక సత్సాంప్రదాయాలను ఇంకా ముందుకు కొనిపోవలసిందనీ, శాంతి, ప్రజాస్వామ్య [illegible] కోసం పోరాడుతూఉన్న ప్రజలతో భుజంభుజంకలిపి ముందుకు సాగిపోవలసిందనీ ఈ మానిఫెస్టోలో అభ్యుదయ రచయితలకందరకు విజ్ఞప్తి చేయబడింది.

## తీర్మానాలు

శాంతినిగురించి ప్రత్యేకంగా చేయబడిన ఒకతీర్మానంలో యుద్ధోన్మాదులనూ, వారి భారతీయమిత్రులనూ తీవ్రంగా నిరసించడం జరిగింది. యీ తీర్మానాన్ని ప్రవేశపెడుతూ డాక్టర్ ముల్కరాజ్ ఆనంద్ యుద్ధశిబిరానికీ శాంతిశిబిరానికీ, ఆటంబాంబులను కూర్చిపేర్చుతూఉన్న అమెరికాకూ, మాస్కోవీధుల కిరువైపులా చెట్లమొక్కల నాటుతూఉన్న సోవియట్ యూనియన్‌కూ మధ్యనున్న వైపరీత్యాన్నిగురించి వివరించాడు. కామన్‌వెల్త్‌తో ఇండియాను ముడిపెట్టినందుకు భారతప్రభుత్వాన్ని ఖండిస్తూ తీర్మానించబడింది. ప్రేమచెంద్ చే స్థాపించబడిన హిందీ అభ్యుదయ పత్రిక 'హంస'పై నిషేధంపెట్టిన యు. పి. ప్రభుత్వ చర్యను ఖండిస్తూ మరోతీర్మానం చేయబడింది. రష్యన్ మహాకవి అయిన పుష్కిన్ 150 వ వార్షికోత్సవం సందర్భంలో సోవియట్ రచయితలనూ, సోవియట్ ప్రజలనూ అభినందిస్తూ నాలుగో తీర్మానం ఆమోదించబడింది. సుప్రసిద్ధ 'మాభూమి' నాటకరచయిత అయిన భాస్కరరావుగారు పౌరసత్వములపై మరొక ప్రత్యేకతీర్మానాన్ని ప్రతిపాదిస్తూ చేసిన ప్రసంగంఅక్కడ సమావేశమైన ప్రతినిధులందరకూ కనువిప్పుగా పనిచేసింది.

పౌరసత్వములకై పోరాడుతూ ఉన్న ఆంధ్ర, తెలంగాణా ప్రజలతో తమ సహ

భావాన్ని ప్రదర్శించడానికి, అక్కడ జరుగుతూన్న ఫాసిస్టు నిర్బంధానికి వ్యతిరేకంగా ప్రజాభిప్రాయాన్ని సమీకరించడానికీ ఆంధ్ర, తెలంగాణాలకు ఒక ప్రతినిధివర్గాన్ని పంపుటకు ఈ సమావేశం నిర్ణయించింది.

చివరకు డాక్టర్ రామబిలాస్‌శర్మ గారు ఇండియాలో భాషాసమస్యను గురించిన రిపోర్టు ఇచ్చారు. వివిధ భాషలు మాట్లాడుతూన్న ప్రజలపై ఒక్క భాషను రాజభాషగా జేసి దానిని ప్రజలందరి నెత్తిపై రుద్దడంలో ఉన్న గుట్టును బట్టబయలు చేశారు. ప్రజాస్వామిక పద్ధతిపై స్వాభావికంగా ఏకభాషగా అభివృద్ధి చెందేందుకు హిందీ ఉర్దూ భాషల రెండింటికి సమానరక్షణ ఉండాలని స్పష్టం చేశారు.

తర్వాత నూతన కార్యనిర్వాహకవర్గ ఎన్నికలు జరిగాయి. డాక్టరు రామబిలాస శర్మగారు కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు. సమావేశానంతరం జరిగిన 'ముషాయిదా' (కావ్యపఠనం) కు అనేకమంది 'భినండి' ప్రజలు హాజరై రాత్రి ఒంటిగంటవరకు కావ్యపఠనం విని తమ ఆనందాన్ని ప్రకటించారు.

('క్రాస్‌రోడ్స్' నుంచి
10 జూన్ 1949)

# వార్తలూ - విశేషాలు

## భారత ప్రజలపట్ల చైనా కార్మికుల సానుభూతి



భారతదేశంలో ప్రజాస్వామిక వాదులపైనా, ట్రేడ్‌యూనియనిస్టులపైనా భారతప్రభుత్వం అమలుజరుపుతోన్న దారుణ హింసాకాండను ఖండిస్తూ న్యూ చైనాన్యూస్ ఏజన్సీద్వారా అఖిలచైనా లేబరు ఫెడరేషన్ ఈ క్రింది విధంగా ప్రకటించింది.

"హైదరాబాద్, జబ్బల్‌పూర్, బొంబాయి, ఢిల్లీ వగైరా అనేక ప్రదేశాల్లో కార్మిక నాయకులనూ, కమ్యూనిస్టులనూ, ప్రజాస్వామిక వాదులనూ ఇండియాప్రభుత్వం అతి దారుణంగా హింసిస్తూ ఉందనీ, హత్యలు చేస్తోందని ఢిల్లీనుంచి వచ్చే సమాచారాలు తెలియజేస్తున్నాయి. ఈ చర్యలపట్ల మా ఆగ్రహావేశాలను ప్రకటిస్తూ ఇండియా ప్రభుత్వానికి మా తీవ్రమైన అసమ్మతిని తెలియపరుస్తున్నాం.

"ఇండియా అభివృద్ధి నిరోధక ప్రభుత్వం అవలంభిస్తూన్న పాశవిక చర్యలు భారతప్రజల శ్రేయస్సుకూ, వారి స్వేచ్ఛా, స్వాతంత్ర్య, ప్రజాస్వామ్యాలకూ, విరుద్ధంగా, అభ్యంతరంగా పరిణమించాయి. ఇలాటి చర్యలను ప్రజాస్వామికవాదులూ, స్వాతంత్ర్య కా కులూ, ప్రపంచశ్రామిక ప్రజలూ సహించరు. భారతప్రజలు వాటిని తీవ్రంగా ప్రతిఘటిస్తారు.

"ప్రభుత్వ దారుణ హింసాకాండకు గురియై అసువుల గోల్పోయిన సోదర భారత కార్మికుల ఎడల ప్రజాస్వామిక వాదుల యెడల మా హృదయపూర్వక సానుభూతిని ప్రకటిస్తున్నాం.

స్వాతంత్ర్యంకోసం, ప్రజాస్వామ్యం కోసం, మీరు సాగిస్తోన్న పోరాటం ప్రపంచశాంతి కాముక ప్రజలందరి సహకారంతో త్వరలోనే తప్పకుండా భారతదేశమంతటా జయప్రదం అవుతుందని మేం దృఢంగా విశ్వసిస్తున్నాం."

(క్రాస్‌రోడ్స్ నుంచి 10-6-49)

## డిటెన్యూల విడుదల ఫ్రెంచి కార్మికుల డిమాండు

70 లక్షల సంఘటిత కార్మికులకు ప్రతినిధి అయిన ఫ్రెంచి సి. జి. టి. భారత ప్రభుత్వానికి ఈ ‘కేబుల్’ పంపింది.

"భా ప్రభుత్వం ధ



రినీ వెంటనే విడుదల చేయవలసిందని డిమాండ్ చేస్తున్నాం.

"భారతకార్మికులతో ఫ్రెంచి కార్మికులు తమ దృఢమైన ఏకీ భావాన్ని ప్రకటిస్తున్నారు."

('పీపుల్స్ హెరాల్డ్' నుంచి 18-5-49)

## అభ్యుదయ పత్రిక: రు 1000, ధరావతు

ఆంధ్రఅభ్యుదయ రచయితల సంఘ పత్రికకు ఎడిటర్, ప్రింటర్, పబ్లిషర్‌గా కృష్ణాజిల్లా ఎడిషనల్ మేజస్ట్రీటువద్ద డిక్లరేషన్ దాఖలు చేయవలసిందని ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘ కార్యదర్శి శ్రీ ప్రయాగ కోదండరామశాస్త్రిగార్కి-కృష్ణా జిల్లా మేజస్ట్రీటువద్దనుంచి ఒక నోటీసు వచ్చింది. ఆనోటీసుప్రకారం శ్రీ ప్రయాగగారు డిక్లరేషన్ దాఖలు చేయగా సెక్యూరిటీగా ముందు రు 1000 ధరావతు కట్టవలసిందనీ ఈ నెల 20 వ తేదీలోపుగా ధరావతు కట్టనిచో 'అభ్యుదయ' డిక్లరేషన్ రద్దుఅయినట్లే భావించబడుతుందనీ వారికి మరొక నోటీసు జారీ చేయబడింది.

## అఖిలభారత శాంతి మహాసభ వాయిదా

'జనత' క్రిందటి సంచికలో 16 లోని 'శాంతి సంస్కృతుల సంరక్షణ' అనే మొదటివ్యాసంలో 1949 మే 31, జూన్ 1 వ తేదీల్లో అఖిలభారత మేధావుల సమావేశం బొంబాయిలో జరగబోతూ ఉందని ప్రకటించబడింది. బొంబాయి నగరంలో ఇదివరకు అమలు పరచిన 144 సెక్షన్‌ను బొంబాయి ప్రభుత్వం మళ్లా పొడిగించడంవల్ల తాత్కాలికంగా ఈసభ వాయిదా వేయబడింది.





# ప్రపంచ శాంతి మహా సభలో

# చైనా ప్రజావాణి

చైనా ప్రతినిధివర్గ నాయకుడు
**ప్రొఫెసర్ కూవ్-మో-జో**
ప్రసంగం

ప్రజాస్వామిక ప్రజాతంత్ర జెకోస్లోవేకియా రాజధానీ నగరం ప్రాగ్‌లో జరుగుతున్న యీ చరిత్రాత్మక ప్రపంచశాంతి మహాసభలో పాల్గొన గలిగినందులకు 44 గురు చైనా ప్రతినిధుల తరఫున నా సంతోషాన్ని తెలియబరుస్తున్నాను. 475, 000, 000 చైనా పౌరుల తరఫున మీ ప్రజలనూ జెకోస్లోవేకియా ప్రజాస్వామిక ప్రజాతంత్ర రిపబ్లికన్ ప్రభుత్వాన్నీ మీ అధ్యక్షుడు కామ్రేడ్ గోట్వాల్డునూ అభినందిస్తున్నాం.

అయితే ఇదే సమయంలో ఫ్రెంచి ప్రజల అభీష్టానికి విరుద్ధముగా ఫ్రెంచి అభివృద్ధినిరోధక ప్రభుత్వం చైనా ప్రతినిధివర్గాన్ని ఫ్రాన్సులో ప్రవేశించకుండా అడ్డుపెట్టినందుకు మా తీవ్ర అసమ్మతిని ప్రకటించుతున్నాం. అమెరికా సామ్రాజ్యవాదుల వొత్తిడికి లొంగిపోయి ఫ్రెంచి ప్రభుత్వము యీ భూ ప్రపంచంలో శాంతిని స్థాపించే మహదాశయాన్ని వ్యతిరేకించి, యావత్తు ప్రపంచ ప్రజలకండ్ల యెదుట బ్రహ్మాండమైన తప్పిదం చేసింది. ఈ ఘోరమైన తప్పిదాన్ని ప్రపంచ ప్రజలూ, ఫ్రెంచి ప్రజలూ ఎన్నటికీ మరచిపోరు.

అమె[illegible] సామ్రాజ్యవాదుల మెప్ప[illegible] నునే ఉద్దే శ్య[illegible] గా [illegible]



కూడా ప్రవర్తించింది. ఈ సందర్భంలో ఫ్రెంచి అభివృద్ధి నిరోధక ప్రభుత్వం జంగ్-కై-షేక్ గతిని జ్ఞప్తికి తెచ్చుకోవడం అవసరం. ఈ ద్రోహికి అమెరికా సామ్రాజ్యవాదుల సంపూర్ణ సహాయమున్నప్పటికీ చైనా ప్రజలు యితణ్ణి కూలద్రోయ గలిగారు. అమెరికా సామ్రాజ్యవాదులకు బంటులుగా వ్యవహరించుతున్న యితరులకుకూడా తొందరలో యీ విధమైన గతే పడుతుందనే విశ్వాసం మాకుంది.

రెండో ప్రపంచయుద్ధంలో యూరపులోవున్న నాజీ జర్మనీనీ, ఆసియాలోవున్న జపాన్ నూ ప్రపంచ ఫాసిస్టు వ్యతిరేక శక్తులు, ముఖ్యంగా సోవియట్ యూనియన్‌లోని వీరోచిత ప్రజలూ ఓడించారు. అది జరిగి యిప్పటికి దాదాపు నాలుగు సంవత్సరాలు గడిచాయి. అయినప్పటికీ ఇంతవరకు శాంతి ఒడంబడికలు జరుగనే లేదు. ప్రపంచమంతటా వున్న ప్రజానీకం స్వాతంత్ర్య వాయువులను [illegible] పీల్చే అవకా[illegible]చనే [illegible]ాద [illegible]గ యుద్ధంకోసం అర్రులు జాస్తున్నారు.

ప్రపంచం రెండు ఖచ్చితమైన శిబిరాలక్రింద చీలిపోయింది. ఒకవైపున అమెరికా సామ్రాజ్యవాదం నాయకత్వాన దురాక్రమణ శిబిరం, రెండోవైపున సోషలిస్టు రాజ్యం సోవియట్ యూనియన్ నాయకత్వాన శాంతి, ప్రజాస్వామిక శిబిరం.

రెండో ప్రపంచ యుద్ధంలో అమెరికా పెట్టుబడిదారులు విపరీతంగా లాభాలు గడించారు. ఆలాభాలను అదేవిధంగానే కొనసాగించుకొనేందుకు ప్రపంచాన్నంతటినీ తమ పాదాక్రాంతం చేసుకోడానికి ప్రయత్నాలు జరుపుతున్నారు. ఇందుకోసమే వారు అందరినీ డాలర్లతోనూ, యాటంబాంబులతోనూ బెదరించుతున్నారు. ప్రపంచంలోని అన్నిమూలలా తమ యుద్ధకేంద్రాలను నిర్మించుకొంటున్నారు. వివిధదేశాలలోని అభివృద్ధి నిరోధక శక్తులకు సహాయం చేస్తున్నారు. తమతమ జాతీయ విముక్తి కోసం పోరాడుతున్న వలస అర్ధ వలసదేశాల ప్రజా విముక్తి పోరాటాలను దారుణంగా

అణచివేయడానికి ఆయా దేశాలలోని అభివృద్ధి నిరోధక శక్తులకు అన్ని విధాలా సహాయపడుతున్నారు. వివిధ దేశాల సర్వస్వాతంత్ర్య హక్కులను బలిచేసే సామ్రాజ్య ఒడంబడికలకు సిద్ధపడుతున్నారు. ప్రపంచశాంతి కోసం ప్రయత్నించుతూ స్వాతంత్ర్య శాంతులను కాంక్షించే జాతుల ప్రయత్నాలకు ఆటంకాలను కల్పించుతున్నారు. మిత్రరాజ్యసమితి ప్రణాళికను (చార్టర్‌ను) మట్టిలోకలిపిందికూడా యీ అమెరికన్ సామ్రాజ్యవాదులే. వీరి దురాశల ఫలితంగానే యుద్ధప్రమాదం వాస్తవంగా మన కండ్లఎదుట నేడు తాండవిస్తోంది.

ప్రపంచప్రజలందరినీ మోసం చేయడానికి అమెరికా సామ్రాజ్యవాదులు ప్రయత్నించుతున్నారు. ఇందుకోసం వారు అందమైన పదాలను గుప్పించుతున్నారు. శాంతి దుర్గమైన సోవియట్ యూనియన్‌ను నిరంకుశరాజ్యమని పేరుపెట్టి దానిపై తమ దుష్ప్రచారాన్నంతటినీ కేంద్రీకరించుతున్నారు. అమెరికా సామ్రాజ్యవాదం తన దురాక్రమణ ఎత్తుగడను మరుగుపరచేందుకు "సహాయ" కార్యక్రమాన్ని (మార్షల్ సహాయం) ప్రారంభించింది. కాని చైనాతో చేసుకొన్న అన్యాయపు ఒడంబడిక లన్నింటినీ రూపుమాపడానికి సోవియట్ యూనియనే మాకు సహాయపడిందనే విషయం చైనాప్రజలైన మాకు తెలుసు. 1926—1927 సంవత్సరాలలో సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా స్వాతంత్ర్యాన్ని పొందడానికి తిరిగి సోవియట్ యూనియన్ మాకు సహాయం చేసింది. చైనాపై జపాన్ దోపిడీ దొంగలు దాడిచేసినప్పుడు సోవియట్ యూనియన్ మా స్వాతంత్ర్య పోరాటానికి ఎలాంటి షరతులు లేకుండా సహాయంచేసింది.

అయితే అమెరికా సంగతేమిటి? అమెరికా ప్రజలు సహజంగా చైనా ప్రజలకు మిత్రులే. కాని అమెరికా సామ్రాజ్యవాద ప్రభుత్వం ఆర్థిక, సాంస్కృతిక రంగాలలో దురాక్రమణ పంథాను అవలంబించుతూ చైనాలోని అభివృద్ధి నిరోధకులతోనూ, ధనిక వర్గాలతోనూ సన్నిహితసంబంధాలను పెట్టుకొన్నది. జపాన్

సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా మేము జరిపిన పోరాట ప్రథమ దశలో అమెరికా సామ్రాజ్యవాదులు జపాన్‌కు పత్తి,ఇనుమూ, నూనె, మందుగుండు సామానూ, యితర యంత్ర సామగ్రీ సరఫరా చేసి జపాన్ దురాక్రమణకు సాయపడ్డారు. పెరల్ హార్బర్ సంఘటన జరిగిన తరువాతనే జపాన్ పై అమెరికా యుద్ధాన్ని ప్రకటించింది. అప్పటికీ చైనా యెడల అమెరికా పాలసీ చైనా ప్రజల అభీష్టానికి విరుద్ధంగానే నడచింది. కొమింటాంగ్‌కు సహాయం చేస్తూ చైనా విముక్తి సైన్యానికి ఏ రకమైన సహాయమూ చేయడానికి అమెరికా ప్రయత్నించలేదు.

జపాన్ లొంగుబాటుతో ప్రాచ్య ఖండంలోని యుద్ధం ముగిసింది. అయినప్పటికీ అమెరికా ప్రభుత్వం కొమింటాంగ్ అభివృద్ధి నిరోధకులకు తన సహాయాన్ని కొనసాగించుతూ, చైనాలో తన సైన్యాలను అట్టే పెట్టి, అక్కడ యుద్ధ కేంద్రాల నిర్మాణాన్ని కొనసాగించింది. యుద్ధం ముగిసినతరువాత అమెరికా ప్రభుత్వం కొమింటాంగ్‌కు చేసిన "సహాయం" 60 కోట్ల డాలర్లకు మించుతుందని నమ్మకంగా తెలుస్తున్నది. ఇదంతా అక్కడ అమెరికా యుద్ధకేంద్రాలను నిర్మించుకోడానికి వినియోగించిందని వేరే చెప్పనవసరం లేదు. చైనాను తన వలసరాజ్యంగానూ, సోవియట్ వ్యతిరేక కేంద్రంగానూ మార్చడానికే అమెరికా సామ్రాజ్యవాదులు చైనా అభివృద్ధి నిరోధకులను బలపరచారు. చైనాలో అమెరికా సామ్రాజ్యవాదులు జోక్యాన్ని కలిగించుకొన్న ఫలితంగా అంతర్యుద్ధం అంతులేనంతగా పెరిగిపోయింది. ఇన్నికష్టాలు అనుభవించిన తరువాత చైనాప్రజలు అమెరికా సామ్రాజ్యవాదం యొక్క దురాక్రమణ దుష్టబుద్ధిని బాగా అర్థంచేసుకోగలిగారు.

చైనాలోని అమెరికా సామ్రాజ్యవాదుల పెంపుడుబిడ్డ జెంగ్-కై-షేక్‌ను చైనా ప్రజలు సాయుధ పోరాటంద్వారా చిట్టచివరకు ఓడించివేశారన్న సంగతి నేడందరికీ తెలిసిన విషయమే. కాని అమెరికా సామ్రాజ్యవాదులు తమ దుష్ట ప్రయత్నాలను ఏమాత్రం మానలేదు. నాశనంకాగా మిగిలిపోయిన

జపాన్ ఫాసిస్టు అవశేషాలను అమెరికా సామ్రాజ్యవాదులు బలపరుస్తూనే సోవియట్ యూనియన్‌కూ, యూరప్ ప్రజలకూ వ్యతిరేకంగా కుట్రలను కొనసాగించుతున్నారు. ప్రపంచ భద్రతనూ, అంతర్జాతీయ ఒడంబడికలనూ నాశనంచేస్తూ అమెరికా సామ్రాజ్యవాదులు మిత్రరాజ్య సమితి ఆశయాలకు అనుగుణ్యంగానే నడుస్తున్నామని దొంగ నటనలు చేస్తున్నారు. ఇందుకోసం వారు ప్రజలను మోసగించడానికి పాత ఫాసిస్టు పద్ధతులన్నింటినీ అనుసరించుతున్నారు. చైనా ప్రజల స్వాతంత్ర్యాన్ని హరించడానికి వినియోగించిన పద్ధతుల నన్నింటిని అమెరికా సామ్రాజ్యవాదులు యూరప్ ప్రజలనూ, మానవజాతి నంతటినీ తమ బానిసత్వంలో ముంచడానికి నేడు వినియోగించుతున్నారు. చైనా ప్రజలమైన మేము యీ అంతర్జాతీయ యుద్ధోన్మాదుల నందరినీ మానవజాతికి బద్ధశత్రువులుగా పరిగణించుతాం.

మరొక నూతనయుద్ధం ప్రబద్దలవకుండా చూడాలి. ప్రపంచమంతటా వున్న శాంతికాముక శక్తులన్నీ అతిసన్నిహిత సంబంధాలను ఏర్పరచుకొని, నిర్మాణ యుక్తమైన కార్యాచరణద్వారా యీ యుద్ధప్రమాదాన్ని అరికట్టాలి. ఇతరదేశాల ప్రజలవలెనే అమెరికా దేశ ప్రజలుకూడా యుద్ధాన్ని కోరరనేవిషయంలో మాకు నమ్మకముంది. వాల్ స్ట్రీట్ రక్తపు జలగలు యుద్ధోన్మాద కిరాతకులు మాత్రమే యుద్ధాన్ని కోరుతారు. ఎందువల్లనంటే వారి భవిష్యత్తుయుద్ధం మీదనే ఆధారపడిఉంది. కాని అదే వారి సమాధిని కడుతుంది.

యుద్ధానంతరం అన్ని దేశాలలోని ప్రజలు బ్రహ్మాండంగా పురోగమించారు. సోవియట్ యూనియన్‌లోని యుద్ధానంతర పంచవర్ష ప్రణాళిక జయప్రదంగా కొనసాగుతోంది. మరొకవైపున తూర్పు యూరప్‌లోని ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలు రోజురోజుకు సంఘటితపడుతున్నాయి. సామ్రాజ్యవాద దేశాలలోని ప్రజలు మేల్కొని, ఐక్య మవుతున్నారు. సోవియట్ యూని[illegible] నాయకత్వాన శాంతి[illegible]కాముల శిబిరం [illegible]గ

మించితే శాంతిని కాపాడవచ్చును. ఇప్పటికే ఈ శిబిరం యుద్ధోన్మాదులను చావుదెబ్బ కొట్టగల స్థితిలో వుంది.

చైనాప్రజలమైన మేము గత వందసంవత్సరాలుగా దురాక్రమణను ఎదుర్కొని పోరాడుతున్నాం. ఈ మహాపోరాటంలో ఎన్నో త్యాగాలుచేశాం. ఇంకా అదేరకమైన పట్టుదలతో మా పోరాటాన్ని కొనసాగించుతాం. ఇంకా దూరంగాపోయి గత చరిత్రను లోతుగా నేను తడవదలచలేదు. ఇటీవల పదిసంవత్సరాలలోపున జరిగిన ఘటనలనుండి కొన్ని ఉదాహరణలను ఎత్తిచూపెడతాను. జపాన్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ఎనిమిదిసంవత్సరాలు కఠోరయుద్ధాలు చేసి, చైనా ప్రజలు విజయాన్ని సాధించారు. జపాన్ ఓడిపోయినతరువాత అమెరికా సామ్రాజ్యవాదుల సహాయంతో తిష్టవేసుకొని కూర్చున్న కొమింటాంగ్ అభివృద్ధి నిరోధక ప్రభుత్వాన్ని కూలద్రోయడానికి అదేరకమైన దీక్షతో పోరాటాన్ని కొనసాగించా[illegible] జపాన్ ఆధిపత్యాని[illegible]గినట్లే కొ[illegible] స్వస్తిచెప్పదలచాం. మూడు సంవత్సరాల వీరోచిత పోరాట ఫలితంగా ప్రజావిముక్తిసైన్యం 4,950,000 కొమింటాంగ్ సైన్యాలను సర్వనాశనం చేసింది; చైనా భూభాగంలో 20 కోట్ల జనాభా గలిగిన సగభాగాన్ని విముక్తి చేసింది. శత్రువు చేతిలోవున్న అమెరికా ఆయుధ బలమంతా ప్రజావిముక్తిసైన్యం వశమైంది. కొన్ని లెక్కలను ఉదహరిస్తా; 3013 టాంకులను, 12,026 ఆర్మీ ట్రక్కులనూ, 2,16,766 మెషీన్ గన్‌లనూ, 37,247 ఆర్టిలరీనీ, 26,09,98,031 రౌండ్లమందు గుండుసామానును మేముస్వాధీనం చేసుకొన్నాం. అమెరికా సామ్రాజ్యవాదుల సహాయంతో యుద్ధం చేస్తున్న చైనా కీలుబొమ్మలు మా ప్రజలకు ఆయుధాలను సరఫరా చేశారంటే, అమెరికా మా ఆయుధాగారమే అయిందంటే మీరు నమ్మండి. ఇందులో ఏమాత్రం అతిశయోక్తిలేదు.

47 కోట్ల 50 లక్షల చైనా ప్రజలు శాశ్వతంగా విముక్తి పొందే దినం దగ్గరలోనే పడింది. మేము అత్యద్భుతమైన విజయాన్ని పొందాం. మా విజయాలకు చరి

త్రాత్మక ప్రాముఖ్యతఉంది. ఎందువల్లనంటే మా విజయాల ద్వారా మేము మా స్వాతంత్ర్యాన్ని సాధించుకోవడమేగాక ప్రాచ్యదేశాలలోని అమెరికా సామ్రాజ్యవాద శక్తులకూ, వారి దురాక్రమణ ప్లానులకూ చావు దెబ్బకొట్టాం.

ఇంతటి ఘనమైన విజయాలను చైనా ప్రజలు ఎలా సాధించగలిగారు? ప్రజలకు స్వార్థరహితంగా సేవచేస్తున్న కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన చైనా ప్రజలు ఐక్యమై. తమ స్వాతంత్ర్య సాధనకై తదేకదీక్షతో పోరాడారు. అందుకనే యింతటి మహత్తర విజయం మాకు సాధ్యమైంది. సరియైన నాయకత్వం, దృఢతరమైన ఐక్యత, తీవ్రతరమైన దీక్షా శక్తి మాకున్నాయి. వీటి ఫలితంగానే మేము విజయాలను పొందగలిగాం. అందుకనే, మాకు ఆయుధ సంపత్తి ఎంతో తక్కువగా వున్నప్పటికీ, చిట్టచివరకు మేమే విజయంపొంది, సామ్రాజ్యవాద దురాక్రమణదారులను సర్వనాశనం చేయగలిగాం. చైతన్యపూరితమైన కార్మికవర్గ నాయకత్వాన ఐక్యతతో, తదేకదీక్షతో పోరాడితే ఎంతటి మిలిటరీ బలాన్నైనా, ఎంతటి సామ్రాజ్యవాద కుట్రలనైనా ఓడించగలమని చైనా అనుభవం చాటి చెప్తోంది.

చైనా ప్రజలమైన మేము, నిజంగానే యుద్ధాన్ని ప్రేమించం. ఈ సత్యాన్ని మా అయిదువేల సంవత్సరాల చరిత్ర ఋజువు చేసున్నది. "శాంతి చాల అమూల్యమైనది." ఇది మాజాతీయ నినాదం. కాని మేము ప్రజల శాంతిని, ప్రజాతంత్ర శాంతిని కోరుతాం. దొంగశాంతిని కాదు. విదేశీయుల దురాక్రమణనుండి, విదేశీయుల పీడనుండి మేమెంత మిక్కుటంగా బాధపడినప్పటికీ శాంతికోసం మేమెంతటి త్యాగానికైనా సిద్ధపడుతాం. మేము చైనాలో మహత్తరమైన విప్లవయుద్ధంలో పాల్గొన్నాం. దానివలన దేశంలో న్యాయమైన శాంతినీ, ప్రపంచమంతటా శాశ్వత శాంతినీ స్థాపించాలని ఉబలాటపడ్డాం. మా దృష్టిలో [illegible] శాంతి సహకారాల [illegible]యుక్త కృషి[illegible]

సాధించి, తన యావత్ శక్తినీ వినియోగించి, కాపాడుకోవాలి. ఈ విషయాన్ని చైనా ప్రజలు పరిపూర్ణంగా గ్రహించారు. అందుకనే చైనా ప్రజలు తమంతట తాముగా ముందుకొచ్చి, యీ భూప్రపంచంలో శాంతిరక్షణకు అన్నివిధాలా ప్రయత్నించడానికి సంసిద్ధులవుతున్నారు. సామ్రాజ్యవాదంచే అణచబడుతున్న దూర ప్రాచ్య దేశాలన్నీ యీ మా అభిప్రాయాలతో ఏకీభవిస్తారని మాకు తెలుసు. కాని వారిలో చాలామంది యీ మహాసభకు ప్రతినిధులుగా రావడానికి వీలు లేకపోయింది. అందువలన దూర ప్రాచ్యంలోని ప్రజలంతా ఎలాంటి మినహాయింపులు లేకుండా శాశ్వత శాంతికోసం తమయావత్ శక్తిని వినియోగించగలరని వారందరి తరఫున మేమిక్కడ ప్రకటించడం మా విద్యుక్త ధర్మమని భావించుతున్నాం.

మనమంతా సం... టితపడి మన బలా... ... చేసు కోవ... ...న్న ...క

"అంతర్జాతీయ రంగంలో శాంతి దుర్గమైన సోవియట్ యూనియన్ నాయకత్వాన అంతరంగికంగా ప్రతి దేశంలోనూ చైతన్యపూరితమైన కార్మికవర్గం నాయకత్వాన ప్రజలు పురోగమించితేనే యీనాడు శాంతిని కాపాడగలమని చైనా ప్రజలమైన మేము నమ్ముతున్నాం. దృఢతరమైన ఐక్యతా, కృతనిశ్చయంతో కూడిన పోరాటం వుండాలి. శత్రువు బలాలనుఎక్కువ అంచనా వేయడంకాని, తక్కువ అంచనా వేయడంకాని వుండరాదు. ఆ విధంగానే మనం నూతన దురాక్రమణ యుద్ధ ప్రమాదాన్నుండి ప్రపంచాన్ని కాపాడుకోగలం. కాని చివరకు దురాక్రమణదారులు యుద్ధాన్నే తలపెట్ట సాహసిస్తే ప్రపంచ ప్రజాశక్తులన్నీ వారిని తప్పకుండా ఓడించి, మొత్తం పెట్టుబడిదారీ,సామ్రాజ్యవాద విధానాన్నే తుదముట్టించి మానవజాతిని విముక్తిచేసి, శాశ్వత ప్రజాశాంతిని నెలకొల్పడము తథ్యం.

● ప్రపంచశాంతి కాముకశక్తులన్నీ ఏకంకావాలి!

● దృఢతరమైన ఐక్య పోరాట శక్తితో యుద్ధాన్ని తుదముట్టించండి!!

● ప్రజాస్వామిక ప్రజాతంత్రానికి, శాశ్వతశాంతికి జయమగుగాక!!!

*  *  *

చైనా ప్రతినిధి వర్గనాయకుడు ప్రొఫసర్ కూవ్ - మో - జో ప్రసంగిస్తుంటే ప్రపంచమహాసభ ప్రతినిధులనుండీ, ప్రేక్షకులనుండి హర్షధ్వనులు బ్రహ్మాండంగా వచ్చాయి.

ఉపన్యాస తదనంతరం బ్రహ్మాండమైన హర్షధ్వనులమధ్య చైనా ప్రతినిధి వర్గం ప్రపంచశాంతి మహాసభకు ఒక పెద్ద అరుణపతాకాన్ని బహూకరించారు. ఆ పతాకంపై చైనాభాషలో ప్రపంచ శాంతి కాముక శక్తులన్నీ ఏకం కావాలి! దృఢతరమైన ఐక్యపోరాట శక్తితో యుద్ధాన్ని తుదముట్టించాలి!! ప్రజాస్వామిక ప్రజాతంత్రానికీ, శాశ్వతశాంతికి జయమగు గాక!!! అని వ్రాసిఉంది.



42

# భారతదేశ భాషాసమస్య



రామ్ విలాస్ శర్మ
[అఖిలభారత అభ్యుదయ రచయితల సంఘ ప్రధాన కార్యదర్శి]

భాషాసమస్య ఇటు మామూలు జనసామాన్యానికీ అటు పాలకవర్గాలకు కూడా ముఖ్యమైన సమస్య. భూస్వామిక పెట్టుబడిదారీ దోపిడీకి వ్యతిరేకంగా కష్టజీవులు సంఘటితపడి విజయాన్ని సాధించడంలో భాష చాలముఖ్యమైన పాత్రను నిర్వహిస్తుంది. అందుకనే యిది ప్రజానీకానికి ప్రధానసమస్య. అలాగే పెట్టుబడిదారులకు మార్కెట్టును విస్తరింపజేసుకోవడానికీ, ఆర్థికంగా బలహీనంగా వున్న దేశాలపై తమ దురాక్రమణదాడులను కొనసాగించుకోడానికి పాలకవర్గాలకు భాష బాగావినియోగపడుతుంది. ఒకదేశంలోనే అనేక భాషలుండటం అంటేబూర్జువా భాషాశాస్త్రవేత్తలకు తగనిమంట. గ్రియర్సన్ దృష్టికి ఇండియా ఒక అయోమయభాషల నిలయంగా కనపడింది.
ప్రొ...
...లసదేశాలలోని ప్రజ
...షలు మాత్రమే
...చి బూర్జువా
...గరుబోతు
... సమా
...పతి

దృష్టితో పరిశీలించడానికి వీలుపడుతుంది.

ఇండియా వివిధ జాతులుగల దేశం; అందులో అనేక భాషలు మాట్లాడే ప్రజలు న్నారు. జాతి అంటే ఏమిటి? జాతి అంటే ప్రఖ్యాత శాస్త్రీయ నిర్వచనం యిది:

"ఒకే భాషను మాట్లాడుతూ, ఒకే భూభాగంలో నివసిస్తూ, ఒకే రకమైన ఆర్థిక జీవితాన్ని, సాంఘిక సంస్కృతిలో ఒకే రకపు మానసిక తత్వాన్ని కలిగివుండి, చారిత్రకంగా అభివృద్ధి చెందిన ప్రజాసంఘమే 'జాతి' అనబడుతుంది."

ఈ నిర్వచనం ప్రకారం బెంగాలీ, మరాఠీ, గుజరాతీ, తమిళం, తెలుగు భాషలు మాట్లాడే బెంగాలీలూ, మహారాష్ట్రీలూ, గుజరాతీలూ, తమిళులూ, ఆంధ్రులూ వివిధ జాతులకుచెంది ఉన్నారు. ఒక జాతి అస్తిత్వానికి భాష అతి

గించాలా లేదా అనే విషయాన్ని నిర్ణయించుకొనే హక్కు ఆ ప్రజలకు మాత్రమే ఉంటుంది. అసలు ప్రజలు తమ రాజకీయ, పరిపాలనా, సాంస్కృతిక వ్యవహారాలను తమ స్వంతభాషలో నిర్వహించుకొన్నప్పుడేవారు తమ జాతీయస్వాతంత్ర్యాన్నిఅనుభవించ గలుగుతారు. వివిధ జాతులు గలిగిన ప్రజాతంత్ర యూనియన్‌లో ఒక నిర్బంధ రాజ భాషంటూ వుండటమే అసంగతం.

## హిందీ - ఉర్దూల సమస్య

పాలకవర్గాలు హిందీ, ఉర్దూ సమస్యను తమస్వప్రయోజనాలకోసం వినియోగించుకుంటున్నారు. ఇంకే విషయంలోనూ ప్రజల కోర్కెలను తీర్చలేక పాలకవర్గంలో సంస్కృతిరంగంలో భాషారక్షకురాలుగా ముందుకొస్తున్నది. ప్రజలకు కనీసం కావలసిన తిండి బట్టా యివ్వలేని దోపిడీవర్గాల అధిక లాభాలను సంరక్షకుడుగావుండే యీ పాలకవర్గం ప్రజల నిజమైన భాషా సంస్కృతులను రక్షిస్తుందంటే నమ్మడమెలా? ప్రజలు సాంఘికంగా, ఆర్థికంగా బానిసత్వాన్నుండి విముక్తి పొందినప్పుడే ప్రజలభాష సంపూర్ణంగా అభివృద్ధి చెందడానికి అవకాశం ఉంటుంది. సాంఘిక, ఆర్థిక బానిసత్వాన్నుండి విముక్తి పొందాలనే ప్రజల గాఢమైన వాంఛను పెడమార్గాలకు తొక్కించడానికీ సామాన్య ప్రజలను భాషా సంస్కృతుల సమస్యపై నీలదీయడానికి పాలకవర్గాలు ప్రయత్నించుతాయి. అందుకోసమే ప్రజల యెదుట యీ రకమైన ప్రశ్న నుంచుతారు: హిందీ, ఉర్దూలలో మీరు దేనినో ఒకదానిని మాత్రమే కోరుకోవాలి. అందులో ఒకదానిని తప్పనిసరిగా మీరు త్యజించవలసిఉంది. దేనిని త్యజించాలో తెలియజేయండి.

పై ప్రశ్నకు సరియైన జవాబుకోసం మనం ప్రయత్నం చేసినంతకాలం - ప్రత్యక్షముగానో పరోక్షముగానో పైన ఇచ్చిన ప్రశ్న స్వభావాన్ని అంగీకరించినంతకాలం న్యాయంగానూ, తృప్తికరంగానూ యీ సమస్యను మనం పరిష్కరించలేము. హిందీ, ఉర్దూలు రెండు ప్రత్యేకమైన భాషలా? లేక అవి ఒకే భాషకు చెందిన రెండు సాహిత్య శైలిస్వరూపాలా? రెండింటికీ సమానమైన హంశాలేమిటి? రెండింటినీ వేరుపరచే హంశాలేమిటి? హిందీ, ఉర్దూలూ రెండూ మూలంలో ఒకే భాష. ఎందువల్లనంటే రెండింటిని మాట్లాడే స్వరూపమూ ఒకటే. కార్మికులు తమ నిత్యకార్యకలాపాలలోనూ, మిల్లులలోనూ, వర్కుషాపులలోనూ, రైతులు తమ పొలాలలోనూ, మధ్యతరగతి ప్రజ ప్రతినిత్యమూ సంభాషించుకొనేటప్పుడూ ఒకేరకమైన భాషను మాట్లాడుతారు. వారు నిత్యమూ మాట్లాడుకొనే సంభాషణల్లో హిందీ, ఉర్దూ వ్యత్యాసాలను పాటించరు. దీనిమూలంగా మనకు అర్థమయ్యేదేమంటే వారంతా ఒకే జాతికి చెందినవారని, ఒకే భాషను మాట్లాడేవారని రుజువవుతున్నది. ఈ భాషకు చరిత్రరీత్యా నిజమైన పేరు 'ఖారీబోలీ'.

ఒకజాతి ఒకే వాడుకభాషను కలిగి ఉంటుంది. అయితే భాషలో స్థానికం కొంత తేడా వుండవచ్చు. ఈ రకమైన స్వల్పతేడాలు బాగా అభివృద్ధిచెందిన దేశాలలోకూడా వున్నాయి. కాని ఒకే జాతిలో రెండు ప్రత్యేకభాషలకు మతం మాత్రం ఎన్నడూ పునాది కాదు.

హిందీ ఉర్దూల మధ్యనున్న ప్రధాన ఐక్యత వాటి రెడింటికీ మూలమైన ప్రజల వాడుకభాషలో స్పష్టంగా కనపడుతుంది. రెండింటికీ సమానమైన మూల పదాలను విడిచిపెట్టి సంస్కృతభూయిష్టమైన ఒక్క హిందీవాక్యాన్నిగాని, పర్షియన్ భూయిష్టమైన ఒక్క ఉర్దూ వాక్యాన్నిగాని రాయడం సాధ్యంకాదు. హిందీ - ఉర్దూలు రెండూ అసలు మూలానికి దూరంగా వెళ్ళినకొద్దీ వాటిలో తేడా ఎక్కువ కానవస్తుంది. అవి రెండూ ఉభయులకూ అసలు మూలానికి ఎంత సన్నిహితంగావుంటే, అవికూడా అంత సన్నిహితంగా వుండి వాటిమధ్యవున్న తేడాలు అంతరించుతాయి. వాడుకభాష ఎంతగా ప్రచారంలోకివస్తే అంత ఎక్కువగా దానికి సంస్కృత భూయిష్టమైన హిందీతోనూ, పర్షియన్ భూయిష్టమైన ఉర్దూతోనూ అంత ఎక్కువగా సంఘర్షణ తప్పక వస్తుంది. "ఖారీబోలీ" జాతీయంగా పూర్తిగా అభివృద్ధికావలసిన చారిత్రాత్మక అవసరమే మామూలు ప్రజానీకాన్ని ఉన్నతసాంస్కృతిక అవసరాల నిమిత్తం ఒకే ఏకభాషను అభివృద్ధి చేసేటట్లు చేసితీరుతుంది. ఈనాడు సామాన్య ప్రజానీకం తమ నిత్యవ్యవహారంలో ఏవిధంగా ఒకేవాడుక భాషను ఉపయోగించుతున్నారో అదేవిధంగా యీ ప్రజలు అభివృద్ధి చెందినప్పుడు ఉన్నత సాంస్కృతిక అవసరాలకుకూడా యీ ఏకభాషనే ఉపయోగించి అభివృద్ధి చేసుకొంటారు.

భాషా, సంస్కృతుల విషయంలో మామూలు ప్రజానీకం తమకున్న ఐక్యతను నిలదొక్కుకోలేకపోవడం మూలంగానే హిందీ, ఉర్దూల మధ్యవున్న తేడాలు అదే విధంగా కొనసాగుతున్నాయి. ఈ రకంగా మామూలు ప్రజలు ఐక్యం కాలేక పోవడానికి మూడు కారణాలున్నాయి.

ఒకటి: ఇప్పటివరకూ మనదేశముపై పెత్తనాన్ని చెలాయిస్తున్న బ్రిటిష్ పరిపాలకులు తమ దోపిడీని విచ్చలవిడిగా సాగించేందుకు వీలుగా ప్రజలను నిరక్షరాస్యులుగా అట్టేపెట్టి చీకటిలో వుంచారు. పైగా "నైట్స్"ను "రాయ్ బహుమార్ల"ను తయారుచేశారు. వారే హిందీ, ఉర్దూ సాహిత్యాలకు నాయకులయి కూర్చున్నారు.

రెండోది: హిందీ,ఇస్లాం సంస్కృతులకు పెద్ద పోషకులుగా నటించుతూ ఫ్యూడల్ నిరంకుశరాజులు హిందీ,ఉర్దూల అభివృద్ధిపై తమ ప్రాభవాన్ని గడించారు. ఈ విధంగా ఉర్దూకు నైజాం నవాబు ప్రధాన సంరక్షకుడయ్యాడు. ఆల్వార్ మహారాజు ఇండియాకు "రాష్ట్రభాష" సంస్కృతమే కావాలంటున్నాడు: హిందీ సాహిత్య సమ్మేళన మహాసభలకు భరత్‌పూర్ మహారాజా వీరసావర్కారుతో సహా హాజరై తనకున్న ప్రేమను తెలియజేశాడు. పతనమవుతున్న యీ ఫ్యూడల్ వర్గాలు తమ ఉనికిని కాపాడుకొనే ఉద్దేశ్యంతో భాషాపోషకులుగా నటించుతున్నారు. హిందీ, ఉర్దూలలో దురభిమానపూరితమైన పోకడలనూ, కుళ్ళి

పోయిన పాతధోరణులనూ యీఫ్యూడల్ వర్గాలే బలపరచి పెంచుతున్నారు.

ఇక మూడోది : పెట్టుబడిదారీ వర్గాలూ, వారి బంట్లూ ప్రజాసంస్కృతిని గురించీ, ప్రజాభాషను గురించీ పెద్దగా మాట్లాడుతారు. అంతే. కాని ఆచరణలో వారు ఎల్లప్పుడూ తమ హక్కులకొరకు పోరాడే సామాన్య ప్రజల వర్గసంస్థలను దెబ్బకొడుతూనే ఉంటారు. వారికి ప్రజల సృజనాత్మకశక్తిలోగాని, వారిభావనుసరి యైన ప్రజాపద్ధతులలో అభివృద్ధి చేయు డంలోగానీ ఎలాంటి నమ్మకమూలేదు. అందువలన వారు ఒకవైపున ప్రజల సాంఘిక, సాంస్కృతిక అభివృద్ధికి అడ్డు తగులుతూ, మరొకవైపున జాతీయ (ఏక) భాషను సృష్టించే విషయంలో మతాల రేషియోను ప్రవేశపెట్టారు. పర్షియన్, సంస్కృత నిఘంటువులను దగ్గర పెట్టు కొని దామాషా ప్రకారం పదాలను ఏరడం ప్రారంభించారు. వీరి యీ ప్రయత్నాలకు ఎలాంటి గతి పట్టాలో అలాంటి గతే పట్టింది.

## ప్రజల భాష అభివృద్ధిచెంది తీరుతుంది

ఈ లోపున ప్రజలు కాళ్లు ముడుచుకొని కూర్చోలేదు. వారి వర్గ సంస్థలు బలపడ్డాయి. వారి నిత్య జీవితంలోని సాంఘిక రాజకీయ అవసరాలు వారి సామాన్యభాష లోని శబ్ద సముదాయాన్ని ఎక్కువ చేశాయి. స్వాతం త్ర్యంకోసం, ప్రజాస్వామిక విధానంకోసం వారు సాగించు తున్న పోరాటం వారి సామా న్యభాష అభివృద్ధి అయ్యే టట్లు చేసింది. ఈ రకమైన అభివృద్ధిపైన ఉదహరించబడిన నిపుణుల అభిప్రాయాలకు భిన్నంగా జరిగింది. తమ నూతన సాంఘిక అవసరాలకు అవసరమైన పదాలను సమ కూర్చుకోవడంలో ప్రజల సృజ నాత్మకశక్తి ప్రదర్శితమవు తోంది. ఈ శబ్దసముదాయం తమ మామూలు భాషకు చెందిన ప్రత్యేక స్వభావానికి అనుగుణ్యంగా వృద్ధి చెందు తున్నది. ఏది సంస్కృత పదమూ, ఏది పర్షియన్ పదమూ, ఏది విదేశీ పదమూ అనే బాధ వారికి లేదు. తమకు కావలసిన పదాలను, తాము మామూలుగా ఉపయోగించే భాషాసౌందర్యానికి అనుగుణ్య మైన పదాలను స్వేచ్ఛగా అన్ని చోట్లనుండి తెచ్చుకొన్నారు. అనేక భాషలనుండి అనేక పదాలు ప్రజల భాషలోకివచ్చి చేరుతు[illegible] ఉన్న పదా లకు [illegible] ఉండేటట్లు చూ[illegible]చు

కుంటున్నారు. ఈ విధమైన భాషాపరిణామం ప్రజలు ప్రజాతంత్ర పద్ధతులలో ముందుకు పురోగమించినకొద్దీ వృద్ధి అవుతుంది. ఈ రకమైన పరిణామ క్రమమే చిట్టచివరకు హిందీ, ఉర్దూ సమస్యలను గ్యారంటీగా పరిష్కరించుతుంది. ఈలోపున సంస్కృతంనుండి, పర్షియన్ భాషనుండి హిందీ, ఉర్దూ రచయితలు తెచ్చుకొంటున్న పదాలు త్వరలోనే ఏకభాషకు చెందిన పదాలుగా పరిణామం చెందుతాయి. అయితే కొంత కాలం వరకూ ఉన్నతసాంస్కృతిక అవసరాలకు భాషను వినియోగించేటప్పుడు హిందీ, ఉర్దూలమధ్యవ్యత్యాసం తప్పనిసరి అవుతుంది. కాని హిందీ, ఉర్దూ రచయితలు ప్రజలు నిత్యం వాడుకొనే సామాన్య భాషకు సన్నిహితంగా వుంటూ అందరికీ సమానమైన ఏకభాషను అభివృద్ధిచేసే సూత్రాలకు అనుగుణ్యంగా పదాలను ఏరుకోవడం, లేక సృష్టించడం జరిగితే హిందీ [illegible] స్య వున్న వ[illegible] ల వరకు[illegible]

పైనచెప్పిన విషయాలను దృష్టిలో వుంచుకొంటే హిందీ ఉర్దూలు రెండింటినీ తమ తమ లిపులద్వారా అభివృద్ధి చెందనివ్వాలని స్పష్టపడుతున్నది. రెండింటిలో దేనిని అణచివేయడానికి ప్రయత్నించినా అసలుసమస్య పరిష్కారం కాదు. తాము ఎంతగానో ప్రేమిస్తామని చెప్పుకొనే ప్రజలు సామాన్యపదాలనే సనాతనవాదులైన సంస్కృత పక్షపాతులూ, పర్షియన్ పక్షపాతులూ అనుమానంతో చూస్తారనే విషయాన్ని మన అనుభవమే తెలుపుతోంది. ముఖ్యంగా హిందీ రచయితలు తమ స్వప్రయోజనాలైనా దృష్టిలో వుంచుకొని ఉర్దూను అణచివేయడానికి ప్రయత్నించరాదు. ఉర్దూకు వ్యతిరేకంగా దురభిమాన పూరితంగా చేసే ప్రచారం హిందీలోవున్న సరళమైన ప్రజాపదాలను ప్రత్యక్షంగా దెబ్బతీస్తుంది. హిందీరచయితలు తమ భాషను అనవసరంగా సంత్కృతభూయిష్టంచేసే ప్రయత్నాలను ఎదిరించాలి. ఎందువల్లనంటే ఆవిధంగా చేయడం హిందీ భాషాచరిత్రకూ దాని ప్రత్యేక విశిష్టతకూ విరుద్ధం. సాంకేతిక (టెక్నికల్) పదాలను సమకూర్చాలనే పేరుతో అస్వాభావికమైన పనులు చాలాజరిగాయి. సరళమైన ప్రజాపదాలను వికృతంచేసి అసందర్భంగా ప్రజలపై రుద్దడం జరుగుతున్నది. భారతరాజ్యాంగ ముసాయిదా చట్టంయొక్క హిందీ అనువాదం దీనికి చక్కటి ఉదాహరణ. ముసాయిదా చట్టాన్ని (డ్రాఫ్టుకాంస్టిట్యూషన్) "సంవిధానక ప్రరూప్" అని అనువాదం చేయబడింది. సంస్కృతమూ, పర్షియిన్ భాషా ఒకదానికొకటి చాలదూరంగా వుంటాయి గాబట్టి మనం సమానమైన

ఒకేరకమైన సాంకేతికశబ్దసముదాయాన్ని సృష్టించడం కష్టమని వాదించబడుతున్నది. ఈ సందర్భంలో ఒక చిన్న సంఘటనను అందరు గుర్తుంచుకోవలసివుంది. సంస్కృత భూయిష్టమైన హిందీయే మనకు కావాలని పట్టుదలగా వాదించే రాహుల్ సాంకృత్యాయన్ "డ్రాఫ్టు" అనే ఇంగ్లీషుపదాన్ని "మసాదా" అని తర్జుమా చేశాడు. "డ్రాఫ్టు" అనే ఇంగ్లీషుపదానికి హిందీసాంకేతిక పదాన్ని వాడాలని పెద్దగా పరిశోధించి డాక్టర్ రఘువీర "ప్రరూప్" అనే పదాన్ని సృష్టించాడు. ఈ పదం ప్రజలదృష్టిలో ఎంత విరుద్ధంగా వున్నదంటే చివరకు రాహుల్ సాంకృత్యాయన్ సహితం ఉర్దూపదమైన "మసాదా" నే ఆమోదించవలసి వచ్చింది. భాషాసనాతన వాదులు ఎంతకాదన్నా సాంకేతికశబ్ద సముదాయం విషయంలో సహితం ప్రజలు నిత్యమూ వాడుకొనే భాష ఎలానిలదొక్కుకొగలుగుతున్నదో గుజావుచేయడానికి పై ఉదాహరణ స్పష్టమైన నిదర్శన.

హిందీ ఉర్దూలు ఏకభాషగా అభివృద్ధిచెందిన పక్షంలో రెండు లిపులు వుండటం అనవసరమే అవుతుంది. కాని ఉర్దూ లిపిని అణచివేసి, దేవనాగరి లిపిని నిర్బంధం చేయాలనే ప్రస్తుతప్రయత్నం ప్రజాతంత్రానికి విరుద్ధం; అక్రమం. అందువలన తమ కిష్టమైన లిపిని వాడుకొనేందుకు ప్రజలకు సంపూర్ణమైన స్వాతంత్ర్యము ఉండాలి. హిందీ ఉర్దూలు తమ తమ లిపులలో అభివృద్ధి కావడానికి సంపూర్ణమైన ప్రజాతంత్రబద్ధమైన స్వాతంత్ర్యాన్ని కలుగజేయడం మూలముగానే చిట్టచివరకు రెండు భాషలూ ఒకే భాషగా, ఏక లిపిలో అభివృద్ధి చెందడానికి వీలు కలుగుతుంది. భాషాసమస్యను ఆ రకముగా పరిష్కరించడం వలననే తమ వర్గ స్వప్రయోజనాల కోసం భాషాసంస్కృతుల సమస్యల్లో తమను చీల్చడానికి ప్రయత్నించుతున్న వారి ఆటలను ప్రజలు ఐక్యతతో ఓడించగలుగుతారు.

# ఇండియాలో బ్రిటిష్ సామ్రాజ్యవాదుల పన్నాగాలు

★ ఇ. జుకోవ్

[సోవియట్ ప్రఖ్యాత రచయిత ఎ. యమ్. డైకోవ్ "జాతీయ సమస్య - ఇండియాలో బ్రిటిష్ సామ్రాజ్యవాదం" అనే పేరుతో భారతదేశ పరిస్థితులపై 328 పేజీలుగల ఒక గ్రంథాన్ని యిటీవల రచియించాడు.

ఈ గ్రంథాన్ని కామ్రేడ్ ఇ. జుకోవ్ సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ సిద్ధాంత పత్రిక "బోల్షివిక్" 4 వ సంచికలో (22-2-49) సమీక్షచేస్తూ రచయితవచ్చిన కొన్ని నిర్ణయాలు సరి కాదని విమర్శించాడు. ఈ సమీక్ష భారతదేశ పరిస్థితులను మార్క్సిస్టు దృక్పథంతో అర్థంచేసుకోడానికి పాఠకులకు వినియోగ పడుతుందనే భావంతో ప్రకటించుతున్నాం.

ఈ గ్రంథం రష్యన్ భాషలో వెలువడింది. ఇంగ్లీషు అనువాదం యింకా రాలేదు. —సంపాదకవర్గం]

అట్లీ–బెవిన్ల ప్రభుత్వం ఇండియాను రెండు డొమినియన్ రాజ్యాలుగా విభజించిన ఫలితంగా ఇండియాలో బ్రిటిష్ పరిపాలనాయుగం సమాప్తిచెంది,

నూతన రాజకీయ, ఆర్థిక స్వాతంత్ర్య యుగం ఆరంభమైన దని బ్రిటిష్ లేబర్‌పార్టీ ప్రచారకులు పటాటోపంగా ప్రచారం చేస్తున్నారు.

కాని ఇండియాలోని వాస్తవిక పరిస్థితులను జాగ్రత్తగా పరిశీలించితే నామమాత్రమైన మార్పులు మాత్రమే జరిగాయని స్పష్టపడుతుంది. బ్రిటిషు సామ్రాజ్యవాదంపై ఇండియా ఆధారపడే రాజకీయ, ఆర్థిక, మిలిటరీ విధాన స్వరూపంమాత్రమే మారిందని బోధపడుతుంది. కోటానుకోట్ల భారతప్రజలు ఎలాంటి హక్కులు లేక యిదివరలాగానే వలసదేశ వాసులవలె దుర్భర దారిద్ర్య జీవితాన్ని గడుపుతున్నారు.

ఇండియాలోని పరిశ్రమలలోనూ, వర్తక వాణిజ్యాలలోనూ, రవాణా పరిశ్రమలలోనూ; బ్యాంకులలోనూ వున్న బ్రిటిషు పెట్టుబడులు యథాతథంగానే కొనసాగించబడి, బ్రిటిష్ పెట్టుబడిదారులకు విపరీతమైన లాభాలను తెచ్చిపెడుతున్నాయి. ఢిల్లీలో బ్రిటిషు వైస్రాయి లేకపోవచ్చు కాని బ్రిటిషుఆఫీసర్లు యిదివరకువలెనే రెండు డొమినియన్ల కేంద్ర, రాష్ట్ర పరిపాలనా యంత్రాలలోని ప్రధాన స్థానాలలోనూ తిష్టవేసి వున్నారు. ఇండియా పాకిస్థాన్ల రెండింటికీ స్వంత మిలిటరీ బలగాలున్నాయి. కాని వాటి అధ్వర్యం అంతా బ్రిటిషువారిదే.

జనవరి ప్రారంభంలో భారతీయ పత్రికలు "ప్రథమ స్వాతంత్ర్య సంవత్సరం" అన్న శీర్షికల క్రింద గత సంవత్సరంలో సాధించిన ఫలితాలను సమీక్ష చేశాయి. 'అమృత బజార్ పత్రిక' తన నూతనసంవత్సర వ్యాసంలో యిలా రాసింది: "మన ఆశలన్నీ నెరవేరకుండా అసంతృప్తమైన ఒక సంవత్సరం గడచిపోయింది. గతసంవత్సరమంతా మన ప్రజలకు శాంతి, సంపదలను సమకూర్చడానికి ఫలితంలేని ప్రయత్నాలు జరిగాయి." నూతన సంవత్సరప్రారంభంలో 'ఫ్రీప్రెస్ జర్నల్' అనే మరో దినపత్రిక యిలా రాసింది. "ప్రథమ స్వాతంత్ర్య సంవత్సరం ముగిసింది. మనం ధారపోసిన రక్తం, మనం కార్చిన కన్నీరు వృధా అయింది. మనం చేసిన ప్రయత్నాలకూ, చేసిన శ్రమకూ తగిన ఫలితం లేకపోయింది." 'ఈస్టరన్ ఎకానమిస్టు' అనే పత్రిక తన నూతన సంవత్సర సంచికలో 1948 లో ఇండియా సాధించిన ఆర్థిక విజయాలను

గురించి కొన్ని లెక్కలు ప్రకటించింది. ఆ లెక్కలు మనిషి సగటు జాతీయ ఆదాయం ఇదివరకంటె తగ్గిపోయినట్లు చూపెట్టాయి. ఆహారం, బట్టల వినియోగంకూడా ఇదివరకంటె తగ్గిపోయినాయి. ఇదంతా దేన్ని రుజువుచేస్తున్నది? శతాబ్దాల తరబడి బ్రిటిషు వానిసత్వ ఫలితంగా ఇండియా వలసదేశంగా చాల వెనుకబడి ఉంది. గ్రామసీమల్లో ఫ్యూడల్ సంబంధాలు అధికంగా ఉన్నాయి. జాతీయ బడాబూర్జువా వర్గం బ్రిటిషు సామ్రాజ్యవాదులకు సహాయంచేసి ప్రజలకు ద్రోహం చేసింది. ఇవన్నీ ఇదివరలాగానే యిప్పుడూ యథాతథంగా కొనసాగుతూనే ఉన్నాయి.

ఇండియాను రెండుగా విభజించడం మూలంగా పంజాబు, బెంగాల్ రాష్ట్రాలలో దారుణమైన హత్యాకాండ జరిగింది. ఈ రెండు పెద్దరాష్ట్రాలను కృత్రిమంగా విభజించి, ఇండియా పాకిస్తాన్లకు పంచిపెట్టారు. హిందూ ముస్లింల మధ్య ఇంతకుముందెన్నడూ లేనంత విపరీతంగా మతవిద్వేషాలు రెచ్చిపోయాయి. కాశ్మీర్ రెండు డొమినియన్ల మధ్య ఎడతెగని అంతర్యుద్ధానికి కారణభూతమైంది.

ఇండియా పాకిస్తాన్లు నేడు 'స్వతంత్ర' రాజ్యాలు. కాని యిదివరకటివలెనే యిప్పుడుకూడా అవి బ్రిటన్కు ముడిపదార్థాలను సరఫరా చేసే వ్యవసాయిక దేశాలుగానే ఉంటున్నాయి. ఇటీవల సంవత్సరాలలో అమెరికాకు ముడిపదార్థాలు సరఫరా చేసే దేశాలుగా తయారయినాయి. అమెరికా, బ్రిటన్లు ఇండియాకు యంత్రసామాగ్రినీ, యితర పారిశ్రామిక పరికరాలను అమ్మనిరాకరించి అప్పులుపెట్టడానికి మాత్రం సిద్ధపడుతున్నాయి. ఈ విధంగా ఇండియాను తమ అధీనంక్రింద వుంచుకోడానికి అవి ప్రయత్నించుతున్నాయి. అప్పులుపెట్టి తద్వారా వస్తువులను సరఫరా చేయడం మూలంగా ఇండియాలో విమానాశ్రయాలను తమకోసం పునర్నిర్మించవచ్చునని వూహించుతున్నారు. ఆసియా అంతటా వైమానికకేంద్రాలను నిర్మించడానికి ఆంగ్లో-అమెరికా కూటమి నేడు ప్రయత్నించుతున్నది. ఈ ప్రయత్నంలో ఇండియా

ఆ కూటమిలోకి ఈడ్వబడుతున్నది. నిజానికిదే నేడు ఇండియా అనుభవిస్తున్న స్వతంత్రం!

ఫ్యూడల్ భూస్వామిక వర్గాలతో అతిసన్నిహితంగా వుండే జాతీయ బడాబూర్జువావర్గమే నేడు ఇండియాలో అధికారం చెలాయించుతూ పరిపాలనను సాగించుతోంది. కార్మిక కర్షకుల అభ్యుదయకర మేధావుల ప్రజాతంత్ర ఉద్యమాలను అణచివేసే పాత బ్రిటిష్ విధానాన్నే యీ ప్రభుత్వంకూడా కొనసాగించుతున్నదంటే ఆశ్చర్యపడ నవసరం లేదు. భారతీయ నగరాలలో ఊరేగింపులపై పోలీసు కాల్పులు నిత్యకృత్యమయ్యాయి. సమ్మెలు చేసే ఫ్యాక్టరీ కార్మికుల అరెస్టులు మామూలు అయిపోయినాయి. బ్రిటిష్ వైస్రాయి పరిపాలనలో వలెనే కార్మికవర్గ ప్రయోజనాల కోసం పోరాడే వారినీ, స్వాతంత్ర్య ప్రజాస్వామికంలకోసం కృషి చేసే వారిని జైళ్లలో బంధించుతున్నారు. ముఖ్యంగా యిటీవలి కాలంలో ఇండియా ప్రభుత్వం ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదుల ఆజ్ఞల నందుకుని అ... దయకర కార్మికుల ...

ముఖ్యంగా భారతీయ కమ్యూనిస్టులపైనా నిర్బంధవిధానాన్ని మరింత తీవ్రతరం చేసింది.

ఇండియాను రెండుబలహీన డొమినియన్ల క్రింద (బలహీనంగాబట్టి తప్పనిసరిగా బ్రిటన్‌పై ఆధారపడి ఉంటాయి.) విభజించినది అట్లీ - బెవిన్ల లేబర్ ప్రభుత్వమేనన్న విషయం అందరికీ తెలిసినదే ఇండియాలో రోజురోజుకు తీవ్రతర మవుతున్న బ్రిటిష్‌వ్యతిరేక జాతీయవిముక్తి ఉద్యమ వొత్తిడికి తట్టుకోలేక బ్రిటిష్ లేబరుప్రభుత్వం పతనం కాబోతున్న తన సామ్రాజ్యాన్ని ఏదోవిధంగా రక్షించుకొనే ఉద్దేశ్యంతో భారతజాతీయ బడాబూర్జువా జమిందారీ వర్గాలతో రాజీపడి, వారి అంగీకారంతోనే ఇండియాను రెండు డొమినియన్ రాజ్యాలుగా విభజించింది. ఈ విధంగా బ్రి... ప్రభుత్వం ఇండియాపై త... ...న్న నూతన పద్ధతు... కో...

రాదు ప్రసిద్ధికెక్కింది. ఈ సందర్భంలో బ్రిటిషు సామ్రాజ్యవాదం తన బంట్లు లేబరు సామ్రాజ్యవాదుల ద్వారా తన 'వంచన సూత్రాలను' అన్వయపరచి కరుడుగట్టిన భారత పాలక వర్గాలతో రాజీపడింది. భారత బూర్జువావర్గంగూడా జాతీయ విముక్తి ఉద్యమంయొక్క తీవ్రతకు ప్రజావిప్లవానికి భయపడి, తన ప్రయోజనాలను కాపాడుకొనే ఉద్దేశ్యంతో విదేశీ సామ్రాజ్యవాదులతో రాజీకి సిద్ధపడింది.

ఈ సందర్భంలో లేబరు నాయకులు బ్రిటిషు వలసదేశ విధానంలోని పూర్తిఅనుభవాల్ని వినియోగించుకొని భారత బూర్జువా వర్గం లాభసాటి బేరాన్ని చేయగలిగారు.

ఇండియాను రెండు డొమినియన్‌లుగా వి... ...ిన పద్ధతి స్వయం ని... ...త్రానికి ...ింది. ...ో బెంగాల్, పంజాబు రాష్ట్రాల విభజన, ఫ్యూడల్ నిరంకుశ రాచరికాలను అలాగే అట్టిపెట్టడం—ఇవన్నీ యీ కృత్రిమ విభజననూ ఎన్నోయేండ్లుగా పరాయి ప్రభుత్వ పాలన ఫలితంగా వస్తున్న విభేదాలను శాశ్వతం జేయడానికే జరిపారు. దానిమూలంగా ఇండియా పాకిస్థాన్‌లకు వచ్చే తగాదా లన్నిటిలోనూ తాను నిష్పక్షపాత బుద్ధితో ప్రవర్తించుతానన్న నెపంతో బ్రిటన్ ఇండియా, పాకిస్తాన్‌ల అంతరంగిక వ్యవహారాలలో జోక్యం కలిగించుకోడానికి వీలుకల్పించుకొన్నది. ఈవిధంగా ఇండియాలోని రాజకీయ శక్తుల దృష్టిని ప్రధానశత్రువైన బ్రిటీషు సామ్రాజ్యవాదాన్నుండి మరల్చడం జరిగింది. 1947-48 లో ఇండియాలో ప్రవేశపెట్టిన 'సంస్కరణల' లో బ్రిటన్ తన చరిత్రలో ఎన్నడూ చేయనంతటి వంచనకరమైన మోసాన్ని చేసిందని చెప్పవచ్చు.

రెండు శతాబ్దాలకుపైగా ...ండియాలో తాను పరిపాలన ...ించిన ఫలితంగా బ్రిటిష్ ...జ్యవాదులు కోటానుకోట

ప్రజలు కొద్దిమంది బ్రిటిష్ వర్తకుల, ఆఫీసర్ల అదుపాజ్ఞల క్రింద ఉంచడానికి వీలుపడే విధానాన్ని సృష్టించగలిగారు. ఇండియాను బానిసత్వంలో అట్టేపెట్టి పీడించుకొని తినడానికి పన్నిన ఎత్తుగడలలో చాలభాగం యీనాడు పనికిరాకుండా పోయినాయి. అందువలన సామ్రాజ్యవాదులే వాటిని అనుసరించడం మానివేశారు. కాని ప్రధానసూత్రాలను మాత్రం నూతన చారిత్రక పరిస్థితులకు అన్వయించి ఆచరణలో పెట్టారు.

## డైకోవ్ గ్రంథం

ఎ. యమ్. డైకోవ్ వ్రాసిన "జాతీయసమస్య – ఇండియాలో బ్రిటిషు సామ్రాజ్యం" అనే గ్రంథంలో బ్రిటిష్ వలసదేశ విధానంలోని అతిముఖ్యమైన 'విభజించి పాలించు' అనే సూత్రాన్ని గురించి విఫలంగా చర్చించబడింది.

ఈ గ్రంథములో రెండుభాగాలున్నాయి. మొదటిభాగంలో రచయిత చారిత్రక దృక్పథంతో జాతీయ సమస్య స్వభావాన్ని గురించీ, బ్రిటిష్ ఆక్రమణవరకూ ఇండియాలోని జాతుల అభివృద్ధిని గురించీ భారతదేశంలో జాతులు పరిణామం, పెట్టుబడిదారీ ప్రభావం, జాతుల అభివృద్ధికి అది కలుగజేసిన ఆటంకాలు మొదలుగా గల సమస్యలు చర్చించాడు. డైకోవ్ భారతప్రజల జాతుల సమస్యను చర్చించుచుతూ, యింతవరకు ఏయేజాతులు ఏర్పడినదీ, ఇంకా ఏర్పడబోతున్న జాతులను గురించీ, వివరంగా తెలియజేశాడు. ఈ భాగంలో ఇండియాలో వివిధజాతులు రాజకీయంగా, ఆర్థికంగా, సాంస్కృతికంగా 'అభివృద్ధిచెందకుండా బ్రిటిష్ సామ్రాజ్యవాద అభివృద్ధి నిరోధకులు ఉద్దేశ్యపూర్వకంగా పెట్టిన అడ్డంకులనుగురించిన విషయాలకు ప్రాధాన్యత యివ్వబడింది

గ్రంథం రెండోభాగంలో భారతదేశంలోని జాతీయవిముక్తి ఉద్యమాన్ని విచ్ఛిన్నపరచడానికి బ్రిటిష్ సామ్రాజ్యవాద పరిపాలకులు తమ "విభజించి పాలించే" సూత్రాన్ని ఏవిధంగా ఆచరణలో పెట్టారో రచయిత చూపెశతాడు. ఈ సందర్భంలో గ్రంథకర్త బ్రిటిష్ పాలసీలోని రెండు

ముఖ్యాంశాలను గురించి ప్రధానంగా వివరించాడు. ఒకటి: ఫ్యూడల్ అభివృద్ధి నిరోధానికి బలమైన కేంద్రాలైన స్వదేశ సంస్థానాలను ఇండియాలోని తమ ఆధిపత్యానికి అండగా బ్రిటిషు వారు వినియోగించడాన్ని తెలిపాడు. (భారత దేశం సాంఘికంగా, ఆర్థికంగా, రాజకీయంగా వెనుక బడి ఉన్నదని చెప్పడానికి యీ సంస్థానాలే నిదర్శనం) రెండు: ప్రజలను సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్నుండి మరల్చడానికీ, జాతీయవిముక్తి ఉద్యమాన్ని విచ్ఛిన్నపరచడానికీ, హిందూముస్లింల మధ్య బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ఉద్దేశ్యపూర్వకంగా మత విద్వేషాలను రెచ్చగొట్టడాన్ని వివరించాడు. ఇంకా యిదికాక సమాజంలో అందరికంటే అధికంగా అణచబడిన అస్పృశ్యులను రెచ్చగొట్టి జాతీయ విముక్తి ఉద్యమాన్ని విచ్ఛిన్నం చేయడానికి చేసిన ప్రయత్నాలుకూడా గ్రంథంలో ఉదహరించబడినాయి. ఇక్కడే గ్రంథం రెండో భాగంలోనే జాతీయ సమస్యయెడల భారత ప్రధానరాజకీయ సంస్థల వైఖరిని గురించికూడా రచయిత వివరించాడు.

## భారతజాతుల అభివృద్ధికి బ్రిటన్ ఆటంకం :

15 వ శతాబ్దం ప్రారంభంలోనే ఇండియాలో వివిధజాతులు పరిణామం చెందడం ప్రారంభమైనదని రచయిత వ్రాశాడు. "15, 16, 17 శతాబ్దాలలో భారత దేశంలో చేతిపనివారూ, చిన్న చిన్న వర్తకులూ, రైతులూ రాజకీయ కార్యకలాపాలలో పాల్గొనడం ప్రారంభించారు. ఇది ఆనాడు మతాలను సంస్కరించడానికిజరిగిన ప్రయత్నాలలో ప్రదర్శితమయింది. దేశంలోని సాంఘిక సంబంధాలను ప్రజాతంత్రం చేయడానికి ప్రయత్నాలు జరిగాయి. ఈ సందర్భంలోనే దేశంలో వివిధ ప్రాంతాలలో రైతు, జాతీయవిముక్తి ఉద్యమాలు ప్రారంభమయ్యాయి. ఈ రాజకీయ కార్యకలాపాలతో పాటు దేశం సాంస్కృతికంగా కూడా అభివృద్ధి చెందడం ఆరంభించింది. భారతీయ ప్రజాభాషలు వృద్ధిపొందడం కూడా ప్రారంభమైంది ఇండియాను బ్రిటిషువారు ఆక్రమించడంతో

యీ కార్యకలాపాలు కట్టుబడిపోయి దేశ రాజకీయ, సాంస్కృతిక జీవితంలో మాంద్యం ఏర్పడింది. ''

—(68-69 పుటలు)

భారత దేశంలోని బ్రిటిషు పరిపాలన దేశంయొక్క ఆర్థిక, సాంస్కృతిక అభివృద్ధిని చాలవరకు అరికట్టింది. బ్రిటిషు పరిపాలన దేశంలోని మధ్యకాలంనాటి ఫ్యూడల్ సాంఘిక, ఆర్థిక వ్యవస్థను బలహీనపరచలేదు సరికదా, పైపెచ్చు దానిని బలపరచింది. ఇండియాలోని వివిధ జాతులు సంఘటితపడే పరిణామాన్ని బ్రిటిషు పరిపాలన ఆచరణలో ఆటంకపరచింది. 19 వ శతాబ్దం మధ్యలోనే ఇండియాలో సహజగాంఅభివృద్ధి చెందుతున్న పెట్టుబడిదారీ సంబంధాలు దేశంలోని అతిప్రధానమైన జాతులు క్రమంగా ఏర్పడటానికి సహాయపడ్డాయి కాని యీ అభివృద్ధి కూడా ఎన్నో అవాంతరాలమధ్య జరిగింది. వివిధజాతీయ సంస్కృతుల అభివృద్ధిని బ్రిటిష్‌సామ్రాజ్యవాదులు దయాదాక్షిణ్యం లేకుండా ఆటంకపరచి అణచివేశారు.

## వివిధ జాతులు

డైకోవ్ వ్రాసిన గ్రంథంలోని ఒక ప్రత్యేక సుగుణం ఏమంటే రచయిత ఇండియాలోవున్న వివిధ జాతులను గురించి వివరంగా వ్రాశాడు. డైకోవ్ యిచ్చిన లెక్కల ప్రకారం ఇండియాలో 12 పరిపూర్ణమైన జాతులున్నాయి. బెంగాలీ, ఒరియా, అస్సాం, మరాఠీ, గుజరాతీ, సింధీ, పఠాన్, కాశ్మీర్, తమిళం, తెలుగు, కన్నడం, మలయాళి, భారత దేశంలోని 19 కోట్ల ప్రజలకు పైగా పైన ఉదహరించిన జాతులకు చెంది ఉంటారు. అంటే మొత్తం భారత జనాభాలో 47.5% అన్న మాట. ఇవిగాక యింకా నాలుగు పెద్దజాతులు — పంజాబీ, రాజస్తానీ, హిందూస్తానీ, బీహారీ — ఏర్పడే పరిణామదశలో ఉన్నాయి. ఈ నాలుగు జాతుల ప్రజలు దాదాపు 19 కోట్ల 20 లక్షలుంటారు. అంటే మొత్తం దేశ జనాభాలో 48% ఫ్యూడల్ విధాన అవశేషాలూ, వ్యక్తిరేకముగా పనిచేస్తున్న మతవిభేదాల ప్రభావమూ యీ నాలుగు జాతులూ పరిపూర్ణంగా ఏర్పడటానికి అడ్డు తగులుతున్నాయి.

ఇంకా దాదాపు 2 కోట్ల ప్రజలు కొండజాతులకు చెంది ఉంటారు. పెట్టుబడిదారీ విధాన ప్రభావం వీటిపై చాల అత్యల్పంగా మాత్రమే పడటం వలన యివి జాతులుగా ఏర్పడే దశకు రాలేక పోయినాయి.

తన పరిపాలనా కాలంలో బ్రిటిష్ పరిపాలకులు భారతదేశ ఆర్థిక విధానాన్ని బ్రిటిష్ పెట్టుబడిదారుల ప్రయోజనాలకు అనుగుణ్యంగా అనుసరించారు. ఇందుకోసం వారు భారత ప్రజలను రాజకీయ బానిసత్వంలోనే అట్టే పెట్టి ప్రజానీకం సాంస్కృతికంగా, రాజకీయంగా వెనకబడిఉండేటట్లు చేసే అభివృద్ధి నిరోధక సాంఘిక వ్యవస్థలను బలపరచారు. ఈ రకంగా దారుణమైన పీడనా విధానాన్ని అనుసరించి, ప్రజలను నిత్యదారిద్ర్యానికి గురిచేశారు. బ్రిటిషు పరిపాలకులు బానిస ప్రజల జాతీయచైతన్యం అభివృద్ధి కాకుండా అడ్డుపడేందుకు ఉద్దేశ్య పూర్వకంగా ఫ్యూడల్ సంస్థానాలను అట్టిపెట్టడమే గాక వివిధ జాతుల జన్మభూముల సరిహద్దులకు సంబంధంలేని రాజకీయ పరిపాలనా ప్రాంతాలను నిర్మించారు.

## నిర్మాణంలో బ్రిటిష్ ఇండియాకు 'స్వతంత్ర' ఇండియాకు తేడా లేదు

బ్రిటిష్ సామ్రాజ్యవాదుల పాలసీ ఎలాంటి మార్పులేకుండా యీనాటికీ అలాగే ఉంచబడింది. బూటక స్వాతంత్ర్యాన్ని ప్రసాదించిన 1947–48 సంస్కరణలలోకూడా ఇది ప్రత్యక్షంగా ప్రదర్శితమైంది. దేశంలోని అన్ని స్వదేశ సంస్థానాలనూ—పెద్దవాటినీ చిన్నవాటినీకూడా కొత్త డొమినియన్‌లలో అలాగే చెక్కుచెదరకుండా అట్టేపెట్టారు. బ్రిటిష్ పరిపాలనా కాలంలో వున్నట్లే యీనాడు కూడా ఇండియా పాకిస్తాన్‌ల పరిపాలన విభజనలు ఎలాంటి మార్పులు లేకుండా ఉంచబడింది. రెండు డొమినియనులలోనూ ఇదివరకటివలెనే యిప్పుడుకూడా బ్రిటిష్ ఆఫీసర్లు పరిపాలనా యంత్రంలోని ప్రధాన పదవులను ఆక్రమించుకొని వున్నారు. రెండు డొమినియన్‌ల సైన్యాలు బ్రిటిష్ సామ్రాజ్యవాద ఆఫీసర్ల అధ్వార్యానే ఉన్నాయి. రెండు డొమినియన్ రాజ్యాల

లోనూ ఇంగ్లీషునే రాజభాషగా యిప్పటికీ కొనసాగించుతున్నారు.

భారతదేశాన్ని జాతుల ప్రాతిపదికపై గాక మతాన్ని ఆధారం చేసుకొని రెండు డొమినియన్లుగా విభజించారు. అందువలన బ్రిటిషువారు యిదివరకు భారతదేశంలోని వివిధజాతులు సంఘటిత పడకుండా చేయాలన్న ఉద్దేశ్యంతో ఏర్పరచిన రాజకీయ పరిపాలనా విభజననే తిరిగి అంగీకరించి బలపరచడం జరిగింది. జాతులు సంఘటితపడి బలపడితే బ్రిటిషు సామ్రాజ్యవాద పరిపాలనకూ, స్వదేశసంస్థానాధిపతులకూ, మతవిబేధాలకు ప్రధానంగా ప్రమాదం ఏర్పడుతుంది. అందుకనే అభివృద్ధినిరోధక ప్రభుత్వం జాతుల అభివృద్ధిని అరికట్టింది.

"బ్రిటిష్ ఇండియా సరిహద్దులలో "జాతీయ రాష్ట్రాలను" ఏర్పరచి వున్నట్లయితే తమ తమ జాతుల ప్రజలను అనేక ప్రాంతాలలో చెల్లాచెదరుచేసిన పరిపాలనాయంత్రాన్ని ముఖ్యంగా నిరంకుశ స్వదేశ సంస్థానాలను సంపూర్తిగా తుడమిట్టించడానికి భారత ప్రజలు ఉద్యుక్తులై ఉండెడివారు. ఆ విధమైన పరిపాలనావిధానాన్ని అంతమొందించనిదే ఇండియాలోని నిజమైన ప్రజాతంత్ర రాజకీయ పరిపాలనా విధానాన్ని నిర్మించడం అసాధ్యం. అప్పుడు కుల మత విబేధాలను రెచ్చగొట్టడంకూడా అభివృద్ధి నిరోధకులకు కష్టమయ్యేది." —(159 పేజీ)

బ్రిటిష్ సామ్రాజ్యవాదమూ, దాని 'లేబరు' బంట్లూ దేశంలో కుల మత విభేదాలను రెచ్చగొట్టే దురుద్దేశ్యంతో పని చేశారు. "పంజాబురాష్ట్రాన్ని విభజించడముతో హిందూ ముస్లింల మధ్య ఘోరమైన కొట్లాటలు జరిగాయి. అతిదారుణమైన హత్యాకాండ జరిగింది. కొన్నివందల వేల ప్రజలు చంపబడ్డారు. గాయిపడ్డారు. లక్షలాది ప్రజలు ఇండ్లనూ, ఆస్తులను పోగొట్టుకొని, తమ జన్మస్థానాలను వదిలిపెట్టి వెళ్ళవలసిన గతి పట్టింది. భారతీయ పత్రికలు ప్రచురించిన సమాచారాన్నిబట్టి 40 లక్షల హిందువులూ, సిక్కులూ పాకిస్తాన్‌ను విడిచిపెట్టి ఇండియన్ యూనియన్ ప్రాంతానికి తరలిపోయారు. దాదాపు అదే సంఖ్యగల ముస్లింలు ఇండియాను విడిచిపెట్టి వెళ్ళవలసివచ్చింది."

—(274–75 పేజీలో)

## బీభత్సానికి బ్రిటిష్ లేబరు ప్రభుత్వమే కారణం

ఇండియాలో జరిగిన యీ భయంకర ఘటనలకు బ్రిటిషు లేబరు ప్రభుత్వం తనకుగల బాధ్యతను ఎన్నడూ తప్పించుకోలేదు.

'మౌంట్ బాటన్ ప్లాను' ను అమలుపరచి దేశాన్ని కృత్రిమంగా విభజించిన ప్రత్యక్ష ఫలితమే యీ దారుణ హత్యాకాండ. ప్రజా బాహుళ్యంలో పెద్ద ఎత్తున ద్వేషాలను రెచ్చగొట్టి, ఖూనీలను ప్రోత్సహించి, తద్వారా దేశాన్ని విభజించి బలహీనపరచాలనే ఎత్తుగడను బ్రిటిష్ సామ్రాజ్యవాదం పూర్తిగా ఆలోచించి మరీపన్నింది. ఈ యదార్థాన్ని మితవాద లేబరు పార్టీ నాయకుల పచ్చిమోసము సహితం దాచలేదు. ఇండియా పాకిస్తాన్ల మధ్య వైరుధ్యాలను, ద్వేషాలనుఅట్టేపెట్టి వుంచడానికి పంజాబు, బెంగాల్ రాష్ట్రాల విభజన, కాశ్మీర్ సమస్యా బాగా పని చేస్తాయి. ఈఅవకాశాన్ని బ్రిటన్-అమెరికాలు చాల కాలమువరకు తమ ప్రయోజనాలకోసం వినియోగించుకొంటూయుండడానికి ఎలాంటి సందేహం లేదు. —(162 పేజీ)

ఇండియాను విభజించిన వెనువెంటనే కాశ్మీర్ సంస్థానం రెండు డొమినియన్ల మధ్య కలహానికి కారణమైంది. కాశ్మీర్ సంస్థానం ఇండియన్ యూనియన్లో చేరాలనే తన ఉద్దేశ్యాన్ని ప్రకటించగానే పాకిస్తాన్ ఆ నిర్ణయంయొక్క న్యాయాన్ని గురించి తగాయిదాను ప్రారంభించింది కాశ్మీర్ లోని మెజారిటీ ప్రజలు ముస్లింలుగాబట్టి ఇండియాలో చేరడానికి వీలులేదని వాదించడం ప్రారంభించింది. ఆ తరువాత పాకిస్తాన్ సాయుధసైన్యాలు కాశ్మీర్ పై దాడిచేయడం, ఇండియన్ యూనియన్ దానిని ప్రతిఘటించడం ఎన్నో కష్టనష్టాలతోకూడిన దీర్ఘకాల యుద్ధానికి కాశ్మీర్ ప్రజలు గురికావడం జరిగింది. ఈ సందర్భంలో ఇండియా, పాకిస్తాన్ - ఉభయుల సైన్యాలకు ఆధిపత్యం వహించినది బ్రిటిషు ఆఫీసర్లే అనే విషయం గుర్తించదగినది.

ఇటీవలఉభయులమధ్యరాజీజరిగినప్పటికీ పాకిస్తాన్గాని, ఇండియాగాని తనసైన్యాలను కాశ్మీర్నుండి ఉపసంహరించుకోడానికి సిద్ధపడటములేదు. సామ్రాజ్యవాద బ్రిటనే కాక అమెరికాకూడా

కాశ్మీరును ఒక అతి ముఖ్యమైన కీలక ప్రదేశంగా పరిగణించి, ఆ సమస్యలో విపరీతమైన శ్రద్ధ తీసుకొంటున్నాయి. కాశ్మీర్ అంతరంగిక తగాయిదాలతో కలతమతమవుతూ అలాగే వుండటం సామ్రాజ్యవాదుల అభిమతం. ఇందువలన యీ తగాయిదాలో జోక్యం కలిగించుకొనేందుకు వారికి చక్కటి అవకాశం ఉంటుంది.

## భారత బూర్జువావర్గానికి గుజరాతీ - మార్వాడీ నాయకత్వం

ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ అగ్ర నాయకత్వ స్వభావాన్ని గురించి కామ్రేడ్ డైకోవ్ పరిశీలన చేస్తూ బ్రిటిషు సామ్రాజ్యవాదానికీ భారత బడా బూర్జువావర్గానికీ మధ్య జరిగిన ఒడంబడిక సామ్రాజ్యవాదులకూ భారత బూర్జువావర్గములో ఆర్థికంగా బలవత్తర భాగమైన గుజరాతీ - మార్వారీ ముఠాకు జరిగిన రాజీ అనే నిర్ణయానికి వచ్చాడు. దానినే స్పష్టముగా చెప్పాలంటే, పశ్చిమ ఇండియాలో బాగా అభివృద్ధి చెందిన రెండు జాతులకూ - గుజరాతీ - మార్వారీలకూ - ప్రాతినిధ్యం వహించే బొంబాయి బడా బూర్జువావర్గం బ్రిటన్‌కు ప్రధాన మిత్రుడుగా బయటకొచ్చింది. ఈ రెండు జాతులకు చెందిన ప్రజలు 3 కోట్ల 70 లక్షలు వుంటారు. అంటే ఇండియా మొత్తం జనాభాలో నూటికి పది అన్నమాట. గుజరాతీ మార్వారీ బూర్జువావర్గం ఇండియన్ యూనియన్‌లోని ప్రజలను అణచిపెట్టే జాతీయ బూర్జువా పంథాను చురుకుగా ఆచరణలో పెట్టడానికి ప్రారంభించింది.

"గుజరాతీ - మార్వారీ బూర్జువావర్గ సామ్రాజ్యవాద ఆశయాలను ప్రతిబింబించే భారత రాజ్యాంగ పరిషత్తు హిందీ, ఇంగ్లీషులను భారత రాజభాషలుగా ప్రకటించింది."

—(163 పేజీ)

అందువలన గుజరాతీ - మార్వారీ అభివృద్ధి నిరోధక బూర్జువావర్గం మామూలు ప్రజల ప్రతి ప్రజాతంత్ర పోరాటానికీ వ్యతిరేకంగా వుంకటంలో ఏమాత్రం ఆశ్చర్యం కనబడదు. ఫ్యూడల్ స్వదేశసంస్థానాధిపతుల యెడల భారత బడాబూర్జువావర్గం అనుసరించే పాలసీ మరీ స్పష్టంగా కనపడుతున్నది. "ఇండియా ప్రభుత్వం

సంస్థానాధిపతులనుండి కొన్ని లాభాలనుపొంది వారితో రాజీ పడే పంథాను అనుసరించుతూ, మరొకవైపున రైతుఉద్యమాన్ని అణచివేయడానికి సంస్థానాధిపతులకు సహాయపడుతున్నది.”

—(193 పేజీ)

ఇండియాలో బ్రిటిష్ పరిపాలనకు మూలస్థంభాలుగా వ్యవహరించిన సంస్థానాధిపతుల యెడల భారత బడాబూర్జువావర్గం ప్రదర్శించే వైఖరే వారి అభివృద్ధి నిరోధక స్వభావాన్ని పూర్తిగా బట్టబయలు చేస్తున్నది. వారు బ్రిటిష్ సామ్రాజ్యవాదంతో చేసుకొన్న రాజీయే “సామ్రాజ్యవాద ఏజెంట్లు అయిన నిరంకుశ రాజులతో రాజీపడేందుకు దారితీసింది.” (190 పేజీ) ఈ రకమైన రాజీపడేటప్పుడైనా కాంగ్రెసులో అతివాద నాయకులమని డబ్బా వాయించుకొనే నెహ్రూ వగైరాలు నిరంకుశ సంస్థానాలను రద్దుచేసే ప్లానును సహితం ప్రతిపాదించక పోవడం గుర్తించవలసిన విషయం. ఇక యీ సందర్భంలో గాంధీవైఖరినిగురించి చెప్పాలంటే రాజకోటలో ప్రజాఉద్యమం ప్రజ్వరిల్లగానే “అది హింసా పూరితమైన స్వభావాన్ని తీసుకొంటున్నదనే” సాకుతో ఆయన వెనకబడిన సంస్థానాలలో ప్రజాఉద్యమాలను ఆపివేయవలసిందని స్పష్టంగా చెప్పివేశాడు.

డైకోవ్ తన గ్రంథంలో 5 కోట్ల అస్పృశ్యుల సమస్యను గురించి విపులంగావివరించుతూ అది భారతదేశంలో అతి ప్రధానమైన తీవ్రమైన సమస్యగా ఉదహరించాడు. అస్పృశ్యుల సమస్య ప్రధానంగా వ్యవసాయ శ్రామికుల, అర్ధశ్రామికుల వర్గసమస్యగా ఆయన వ్రాశాడు. ఈ సందర్భంలో డైకోవ్ యిలా స్పష్టం చేశాడు. “అస్పృశ్యులు శాసన సభలలో వారి కుండవలసిన ప్రాతినిధ్యం మాట అటుంచి ముఖ్యంగా భూమిసమస్యను గురించీ, వ్యవసాయ కూలీలుగా తమ ఆర్థిక హక్కులను గురించీ ప్రధానంగా ఎంచుతున్నారు. అంతేకాదు; వారు అన్ని రకాలైన వెట్టిచాకిరిని రద్దుపరచే విషయంలోనూ, సాంస్కృతికంగా తాము అభివృద్ధిజెందడానికి కలుగజేయవలసిన అవకాశాలనుగురించి ఎక్కువగా శ్రద్ధవహించు తున్నారు.” —(292 పేజీ)

## డైకోవ్ గ్రంథంలోని కొన్ని పొరపాట్లు

డైకోవ్ వ్రాసిన యీ గ్రంథంలో కొన్ని లోట్లు లేకపోలేదు. రచయిత 1947-48 లో ప్రవేశపెట్టబడిన "సంస్కరణల" ప్రాముఖ్యతను తక్కువ అంచనా వేశాడు. "బ్రిటిషు, ఇండియన్ బూర్జువావర్గాల మధ్య తీవ్రమైన వైరుధ్యాలున్నాయి. బ్రిటిషు సామ్రాజ్యవాదం భారత రాజకీయ, ఆర్థిక రంగాలలో భారత బూర్జువావర్గానికి పూర్తిగా కాక, కొంతవరకుమాత్రమే లొంగింది. అయినప్పటికీ 1947 వరకూ బ్రిటిషు సామ్రాజ్యవాదం భారత బూర్జువా వర్గాన్ని పూర్తిగా తన బంటుగా మార్చుకొనలేక పోయింది." —(47 పేజీ)

ఇండియాకు నామమాత్రమైన హక్కులనుమాత్రమేవదలి అసలు కీలకాన్నంతటినీ సామ్రాజ్యవాదులు తమ చేతులలోనే వుంచుకున్నారు." అసలు బ్రిటిషు ఎత్తుగడల అంతరార్థమే యిది. అంటే భారత రాజకీయ, ఆర్థిక జీవితంలో ప్రధానమైన కీలక స్థానాలన్నీ బ్రిటిషు సామ్రాజ్యవాదం అధీనంలోనే ఉండి పోయాయి. ర ... నే తన గ్రంథంలో ... విషయాన్నే ఉ ... సహా బలపరుస్తూ వ్రాశా ...

"భారతదేశంలోని జ ... ఉద్యమం ఫ్యూడల్ విధాన వ్య ... రేక ఉద్యమంగానే గాక సామ్రాజ్యవాద వ్యతిరేక ఉద్యమంగా కూడా పరిణమించింది." అని రచయిత వ్రాశాడు. ఈ రకమైన సిద్ధాంతీకరణ పొరపాటు అవుతుంది. మొత్తంగానే భారత జాతుల ఉద్యమాన్ని ఆ విధంగా చిత్రించడం పొరపాటే గాక వాస్తవంగా జరిగిన పరిస్థితులకు కూడా విరుద్ధం. సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ విముక్తి ఉద్యమాన్ని బలహీనపరచేందుకు వివిధజాతుల ఉద్యమాలను సామ్రాజ్యవాదులు వినియోగించిన అనేక ఉదాహరణలున్నాయి. చివరకు రచయితే స్వయముగా సామ్రాజ్యవాద లక్షణాలు గల గుజరాతీ - మార్వాడీ జాతులను గురించి తన గ్రంథంలో ... రించాడు. గుజరా ... బూర్జువా జా ... సామ్రా ...

బూ... లసీని అనుస ...పేర్కొన్నాడు. ...ంచయిత యిలా ... "భారతదేశములోని ... ఉద్యమం ఫ్యూడల్ వ్యతి..., సామ్రాజ్యవాద వ్యతిరేక స్వభావాన్ని చెందివున్నది. అందువలన బ్రిటిషు సామ్రాజ్యవాదం అఖిలభారత జాతీయ విముక్తి ఉద్యమాన్ని చీల్చడానికి జాతుల ఉద్యమాన్ని తగినంతగా (గీతగీసినది నేనే–జుకోవ్) వినియోగించుకోలేకపోయింది. కాబట్టి ఈ జాతుల ఉద్యమాలను సామ్రాజ్యవాదులు అన్ని విధాలా ప్రయత్నించారు." దీనినిబట్టి జాతుల ఉద్యమం బ్రిటిషు సామ్రాజ్యవాదానికి వినియోగపడిందనే విషయాన్నిగానీ, యింకా యిప్పుడు వినియోగపడుతున్నదనే విషయాన్నిగాని డైకోవ్ కాదనడం లేదని అతని మాటలవలననే స్పష్టమవుతున్నది. అయితే ఆ వినియోగపడటం "తగినంతగా" లేదు.

...ాల సమస్యను గురించి ... భారతదేశంలో ... అలాగే ...ంగా

ములో ఆయన యిచ్చిన నిర్ధారణలు బ్రిటిష్ పాలకవర్గాల అండతో నేడు ఇండియాలో అధికారంలోవున్న పీడకవర్గాలను గురించి పాఠకులలో కొన్ని పొరపాటు అభిప్రాయాలను కలుగజేస్తాయి. ఉదాహరణకు 194 పేజీలో ప్రస్తుత ఇండియా ప్రభుత్వము భారత బడాబూర్జువావర్గానికి, పరిశ్రమల యజమానులకు ప్రాతినిధ్యం వహించుతుందనే చెప్పబడిందిగాని భూస్వాముల ప్రయోజనాలకుకూడా ప్రాతినిధ్యం వహించుతుందనే విషయాన్ని ఉదహరించలేదు. అలాగే 305, 314 పేజీలలో భారతదేశంలోని ప్రజాస్వామికశక్తులు భారత బడాబూర్జువావర్గానికి వ్యతిరేకంగానే గాక కోటానుకోట్ల రైతాంగ జనసామాన్యానికి బద్ధశత్రువులైన భూస్వాములకు (జమీందార్లు వగయిరా) వ్యతిరేకంగా పోరాటాన్ని సాగించుతున్నారనే విషయాన్ని ఉదహరించడం రచయిత మరచిపోయాడు.

గ్రంథంలో చాలచోట్ల భారత జాతీయకాంగ్రెసు నిర్వహించిన అభివృద్ధికర పాత్రను (గతకాలంలో) ఎక్కువ అంచనా

వేయడం జరిగింది. "రెండో ప్రపంచ యుద్ధకాలంలోమాత్రమే జాతీయకాంగ్రెసుకు చెందిన కొంతమంది నాయకులు కులమత సమస్యలపై తామనుసరించుతున్న కార్యక్రమం సరిగాలేదనీ, హిందువుల యెడల బ్రిటిష్ పాలకులు ఉద్దేశ్యపూర్వకంగా వెనుకబడిన ముస్లిం ప్రజానీకంలో కలుగజేసిన ఫలితంగా వారిలో లోతుగా పాతుకుపోయిన అపనమ్మకాన్ని సహితం దృష్టిలో పెట్టుకొని కార్యక్రమం వేసుకోవలసిఉంటుందనే విషయాన్ని గ్రహించారు. దానిఫలితమే మొట్టమొదట రాజగోపాలాచారి తీసుకొన్న కార్యక్రమాన్ని ఆ తరువాత గాంధీ తీసుకోవడం జరిగింది."

—243 పేజీ

ఈ రకమైన ఇతని సిద్ధాంతీకరణ పొరపాటు. దానినిబట్టి బ్రిటిష్ సామ్రాజ్యవాదులు హిందూ-ముస్లిం విభేదాలనురెచ్చగొట్టడానికి ఒక పక్షాన్నే-ముస్లింలను మాత్రమే వినియోగించారనే అపోహను కలిగించుతుంది. ఇది పొరపాటు అనే విషయాన్ని వేరే రుజువుచేయవలసిన అవసరం లేదు. కాశ్మీర్ సమస్య విషయంలోకూడా రచయిత ఒకపక్షవాదననే ఎక్కువగా యిచ్చి కొంతవరకు సమస్యను అతి సూక్ష్మీకరణ చేయడం (పెద్దసమస్యలను అతి చులకనగా పరిగణించుట) జరిగింది.

—(161, 196 పేజీలు)

కొన్ని పొరపాట్లూ, రచయిత వచ్చిన కొన్ని సిద్ధాంతాలు ఖచ్చితంగా లేకపోవడం, కొన్ని పరస్పర విరుద్ధతలు వగైరా పాఠకులను సహేతుకంగా అసంతృప్తి పరచడానికి అవకాశం ఉంది. అయినా గ్రంథం మొత్తంమీద మెచ్చుకోదగినట్టుగా వుంది.

* * *

జాతీయ బూర్జువా అగ్రనాయకులూ, ఫ్యూడల్ భూస్వాములూ బ్రిటిషు సామ్రాజ్యవాదంతో ద్రోహబుద్ధితో చేసుకొన్న రాజీ దుష్ఫలితానికి తాము గురియైనట్లు భారతప్రజలు రోజురోజుకు గ్రహించగలుగుతున్నారు. భారత కార్మికవర్గం నేడు చురుకైన రాజకీయ శక్తిగా తయారైంది. భారత రైతాంగం వెనకబడి వున్నప్పటికీ – అదిరోజురోజుకు వడ్డీవ్యాపారులకూ, నిరంకుశ సంస్థానాధిపతులకూ, ఆంగ్లో

ఇండియన్ ఆఫీసర్లకూ వ్యతిరేకంగా పోరాటంలోకి ప్రవేశించుతోంది. అతివాద కాంగ్రెసువాదులు, "సోషలిస్టులు" వినియోగించే అతివాదపదాడంబరం భారత శ్రామిక ప్రజానీకాన్ని పోరాట పంథానుండి మరల్చలేక పోతున్నది.

ఇదివరకు కనీ, వినీ ఎరుగనంతటి దారుణంగా ఇండియా, పాకిస్తాన్ ప్రభుత్వాలు కమ్యూనిస్టులపై క్రూర నిర్బంధ విధానాన్ని కొనసాగించుతున్నాయి. కాని, భారత ప్రజలలో భారత కమ్యూనిస్టుపార్టీ ప్రతిష్ట రోజురోజుకు పెరుగుతోంది. బ్రిటీషుసామ్రాజ్యవాదుల, భారత పాలకవర్గాలలోని వారి ఏజంట్ల నీచమైన కుట్రలను బహిర్గతం చేసి వాటికి వ్యతిరేకంగా భారత కమ్యూనిస్టుపార్టీ ప్రజాతంత్ర సంఘటనా కార్యక్రమాన్ని స్పష్టంగా ప్రకటించి ఆచరణలో పెడుతోంది. ప్రజాతంత్ర సంఘటన కార్యక్రమంలో యీ క్రింది వంశాలున్నాయి: బ్రిటిషుసామ్రాజ్యంతో ఇండియా పూర్తిగా తెగతెంపులు చేసుకోవడం, నిజమైన ప్రజాతంత్ర ప్రభుత్వాన్ని ఏర్పరచడం జామీందారీ భూస్వామిక విధానాన్ని ఎలాంటి పరిహారం లేకుండా రద్దుపరచి, భూమిని రైతులకు పంచిపెట్టడం, విదేశ పెట్టుబడిదారులకు చెందిన బ్యాంకులను, భారీ పరిశ్రమలనూ, యితర వ్యాపారాలనూ జాతిపరం చేయడం, పరిశ్రమలపై కార్మికులకు కంట్రోలును కలుగజేయడం కనీస వేతనాలనూ, 8 గంటల పనిని నిర్ణయించడం. ఇదిగాక సంస్థానాధిపతులను రద్దుచేయడం భారత దేశంలోని వివిధజాతులకు విడిపోయేహక్కుతోసహా స్వయం నిర్ణయహక్కును యిచ్చివేయడం యీ కార్యక్రమంలో ఉదహరించబడ్డాయి.

ఈరకమైన ప్రజాతంత్ర కార్యక్రమం వివిధ జాతులు కలిగిన భారత ప్రజాకోటిలో అత్యధిక మెజారిటీ ప్రజల ప్రయోజనాలకు అనుగుణ్యంగా వున్నదని ప్రత్యేకంగా రుజువుచేసి చెప్పవలసిన పనిలేదు.

# చైనా ప్రజాసైన్య నిర్మాత

## ★ ★ జనరల్ ఛూటే ★ ★

కొంతకాలం పొలంలో కూలీగా, పశువులకాపరిగా మరి కొంతకాలం ప్రక్కఇండ్లలో నీళ్లు మోస్తూ జీవితాన్ని గడిపిన ఈ వ్యక్తి నేడు ఒక్క చీనావిప్లవ చరిత్రలోనే కాదు యావత్ ప్రపంచ విప్లవచరిత్రలోనే ఒక సేనానాయకుడుగా పరిగణించబడుతున్నాడు. చైనా ప్రజాపోరాటాన్ని, విప్లవ ప్రజాసైన్యాన్ని దిగ్విజయంగా నడిపిన ఈ మహాపురుషుని జీవితాన్ని తెలుసుకోవడం, ఆ జీవితాన్నుండి అనేక విషయాలు నేర్చుకోవడం అభ్యుదయ కాముకులందరి విధి.



1886 సంవత్సరంలో జెక్వాన్ రాష్ట్రంలో మానేచాంగ్ గ్రామంలో ఒక నిరుపేద రైతు కుటుంబంలో పుట్టాడు ఛూటే. ఆ కుటుంబంలో 20

మంది ఉండేవారు. కొద్ది పొలం కౌలుకు తీసుకొని జీవనయాత్ర గడుపుతూ ఉండేవారు. 'ఛూ' అంటే యింటిపేరు (ఎరుపు) 'టే' అంటే (సుగుణవంతుడు) పేరుకు తగిన ప్రతిభను సంపాదించాడు. ఆరవఏట ఊరి బడిలో చదువు ప్రారంభించాడు. డబ్బులేకపోవటంవల్లతలిదండ్రులుఛూటేను చదువు మానిపించారు. తర్వాత ఈయనను పిన తండ్రికి పెంపకంయిచ్చారు. అయన జాగ్రత్తగా చూచేవాడు. ఛూటే కన్‌ఫ్యూషియన్ సిద్ధాంతాలు 6 సంవత్సరాలు చదివాడు. చదువుతూనే పనిచేసేవాడు.

ఈయన 1905 లో ప్రభుత్వ పరీక్షలకు హాజరు అయ్యాడు, 1906 లో హుసింగుకు వెళ్ళి ఆరు మాసములు పాఠశాలలో చదివాడు. తర్వాత మాధ్యమిక పాఠశాలలో ఆరు మాసములు చదివాడు. 1907 లో వ్యాయామ కళాశాలలో చదివి పాసాఅయ్యాడు. 1909 లో యూనాన్ రాష్ట్ర ముఖ్యపట్టణం యూనాన్‌ఫూ మిలిటరీ శిక్షణ శాలలో ప్రవేశించి 1911 లో విప్లవం వరకూ అచ్చటనే ఉన్నాడు. ఆయన ఎప్పుడూ తనొక మిలటరీ మనిషిగా ఉండాలని కోరుతూ ఉండేవాడు. తన చైనా దేశం పారిశ్రామికంగా అభివృద్ధి చెందాలని కోరేవాడు. టీపింగు విప్లవాన్ని గురించి చేనేత కార్మికులు చెబుతుంటే విన్నాడు. సన్‌యట్ సేన్ స్థాపించిన విప్లవ పార్టీలో 1909 లో చేరాడు. 1911 లో మంచూ నిరంకుశులను కూలద్రోయుటకుగాను కంపెనీ కమాండరుగా నియమించబడ్డాడు తరువాత మంచూ.గవర్నరును ఎదిరించుటకుగాను జకచునాన్‌కు పంపబడ్డాడు.

1913 లో బటాలియన్ కమాండరుగా నియమించబడి యిండో-చైనా సరిహద్దులలో రెండు సంవత్సరాలు ఉన్నాడు. 1915 లో జెకీచువాన్‌కు కమాండరుగా పంపబడ్డాడు. అచ్చట విజయం సాధించిన తరువాత బ్రిగేడ్ కమాండరుగా నియమింపబడ్డాడు.

1920 లో తిరిగి మరల యునాన్‌ఫూకు వచ్చాడు. అభివృద్ధి నిరోధకుడైన టాంగ్ చివోతో పోరాడాడు. 1921 సెప్టెంబరునుండి అక్టోబరువరకూ యూనాన్ రాష్ట్ర పోలీసు కమీషనరుగా పనిచేశాడు. అదేసమయంలో టాంగ్‌చావో నిరంకుశ ప్రభువు దాడిచేశాడు ఆ దాడినుంచి తప్పించుకొని కొంత సైన్యంతో కూడా వెళ్ళాడు. ఈయన బింటింగునుండి చుంగ్‌చేరాడు. అచ్చట తిరిగి ఉద్యోగమిస్తామన్నా నిరాకరించాడు. ఇందుకు కారణం నూతన విప్లవపార్టీ అయిన కమ్యూనిస్టుపార్టీ కొరకు అన్వేషించుట ప్రారంభించుటయే. అందుకే ఉద్యోగాన్ని నిరాకరించాడు.

మొదటినుంచీ సైనికులతో కలసిమెలసి యుండేవాడు. కాబట్టి ఛూటే అంటే సైనికుల్లో మంచిపేరుండేది. బాగా కష్టం చేసేవాడు, మంచి శరీర దారుఢ్యం కలవాడు.

కమ్యూనిస్టుపార్టీతో సంబంధం పెట్టుకోవాలని ఛూటే షాంఘై నగరానికి బయలుదేరేడు, పార్టీతో సంబంధం ఎలా పెట్టుకోవాలా అని ఆలోచించ సాగాడు కాని ఆయన కక్కడ పార్టీ కనుపించలేదు. అచ్చటనుండి బయలుదేరి పీపింగులో వెతకడం మొదలుపెట్టాడు. ఈయనతో పాటు సన్‌యట్‌సేన్ పత్రిక అయిన "పీపుల్సుప్రెస్" సంపాదకుడు

సన్. సింగే. నాంగే కూడా పార్టీకొరకు వెతకడం ప్రారంభించాడు. కాని పార్టీ ఆనాడు చాలా బాల్యదశలో ఉంది. అప్పటికి కొద్దినెలల పూర్వమే పార్టీ ఏర్పడింది. అందుచే పార్టీతో సంబంధం పెట్టుకోలేకపోయాడు.

తిరిగి షాంగైవచ్చాడు. అచ్చట సన్ యట్ సేన్‌నీ, వాంగ్ సింగ్ వూ మొదలగు కుమంగుటాంగు నాయకులను కలుసుకున్నాడు. ఈయనను జెక్ చుఆ-న్ వెళ్లి చెంగ్ చుంగ్ వాన్‌కు వ్యతిరేకంగా పోరాడమన్నారు. ఛూనిరాకరించాడు. సరే! అలాగైతే అమెరికా వెళ్లమన్నారు. కాని చూటే జర్మనీ వెళ్లి మిలిటరీ శిక్షణ తీసుకోవాలన్నాడు. ఆ సంవత్సరం సెప్టెంబరులో జర్మనీకి బయలుదేరాడు.

1922 అక్టోబరులో జర్మనీ వెళ్లాడు. అచ్చట చూఎన్. లై మొదలగు కమ్యూనిస్టులను కలుసుకొన్నాడు. ఆ నెలలోనే పార్టీలో సభ్యుడుగా చేరాడు. పార్టీలో చేరునాటికి ఛూటేకు 36 సంవత్సరాల వయస్సు. ఒకసంవత్సరం బెర్లిన్‌లోఉండి జర్మనీ భాష నేర్చుకొన్నాడు. గొటిరిజిన్ వెళ్ళి కాలేజీలోచేరి సోషల్ సైన్సు నేర్చుకున్నాడు. జర్మనీలో చదువుకుంటూనే పార్టీపని చేస్తూఉండేవాడు. 1924 లో అక్కడ ఒక కుమింగుటాంగు శాఖను నిర్మించారు. ఆ రోజుల్లోనే బెర్లిన్‌లో ఒక రాజకీయ వారపత్రికకు సంపాదకుడుగా పనిచేశాడు. 1925 లో ప్రపంచ విద్యార్థి కాంగ్రెసులో ప్రతినిధిగా పాల్గొన్నాడు. చెన్ కాఫ్ అనే అభివృద్ధి నిరోధక బల్గేరియా వాస్తవ్యుని హత్యసందర్భంలో కొంతమంది చైనీయులను అరెస్టుచేయడం జరిగింది. అందులో ఛూ కూడా ఒకడు. 28 గంటల నిర్బంధం అనుభవించి బైటబడ్డాడు.

1925 మే 13 వ తేదీని బెర్లిన్‌లో ఏర్పరచిన కమ్యూనిస్టు మహాసభలో పాల్గొన్నందుకు ఛూటేను 30 గంటలు నిర్బంధములో ఉంచారు, మొత్తం ఛూటే జైలుజీవితం 58 గంటలు మాత్రమే ఈయన రాజకీయాలలో పాల్గొంటున్నాడని జర్మనీనుండి వెళ్ళగొట్టారు.

అచ్చటనుండి యూరపు, సోవియట్ రష్యా తిరిగి 1926 లో చైనా చేరుకున్నాడు. తిన్నగా షాంగే. హాంకోలకు వెళ్ళి అచ్చట నుండి జిల్ చువాన్ చేరాడు. యాంగ్సేవ్ సైన్యంలో చేరమని పార్టీచే నిర్ణయింపబడింది ఏవిధమైన మిలటరీ అధికారిగానుండా, కుమంగుటాంగుమిలటరీ ప్రతినిధిగాను పనిచేశాడు. అచ్చటనుండి కియాంక్సీ వెళ్ళాడు.

1927నాంచాంగులో ఛూ. టే. సైన్యంలో మిలటరీ ట్రయినింగు ప్రిన్సుపాల్ గానూ. పోలీసు బ్యూరో చీఫ్ ఆఫీసరుగాను నియమించబడ్డాడు. అగస్టు 1 వ తేదీన ప్రారంభమైన తిరుగుబాటును పోలీసు ఆఫీసరుగా ఉండి ఆయన స్వయంగా తన పర్యవేక్షణ క్రిందనే నడిపాడు. తిరుగుబాటు అనంతరం 9 వ సైన్యానికి వైస్‌కమాండరుగా నియమించబడ్డాడు.

ఆ టైములో చూ.ఎన్. లై, హోలుంగు చాంగే, లి. సౌ. షే. ఛూ. మొదలగు కామ్రేడ్సుతో కలిసి విప్లవంలో పని చేశాడు.

ఈయన కమ్యూనిస్టుపార్టీలో పోరాటంలో పాల్గొనేముందు రెండువివాహాలు చేసుకున్నాడు. మొదటి భార్య చనిపోయింది. రెండటిభార్య అభ్యుదయ

భావాలుకలది. మొదటిభార్యకు ఒక కుమారుడు 1935 దీర్ఘయాత్ర సమయంలో తల్లిగ్రామంవిడిచి తన 18 సం॥ వయస్సు కలిగిన కుమారుడు వెళ్లాడని పత్రికల్లో చూచాడట ఈయన మొదటి వివాహం చేసుకొనేసర్కి 25 సం॥వయస్సు భార్యకు 18 సం॥రాల వయస్సు. రెండవ భార్య ఉన్నదట.

1928లో దక్షణహునానీ తిరుగుబాటులో హనాన్ గవర్నరు హూబియిచే అరెస్టుచేయబడి నరికివేయబడింది మూడవభార్య వూ. యూ. లాన్. తిరిగి 1923 లో ప్రస్తుతం ఉన్న కాంగ్-కె చుంగేను వివాహం చేసుకున్నాడు

ఒక విలేఖరి ఛూటేనుగురించి కాంగ్ ని అడిగినప్పుడు ఆమె ఇలాచెప్పింది. ఛూటే స్వతస్సిద్ధంగా దయగలవాడు. రెండవది ప్రతి చిన్న పెద్ద విషయానికి ప్రధానమైన బాధ్యత తీసుకొంటాడు. మూడు సామాన్యసైనికునితో తనుకూడా ఒకడిగానే భావించి వాళ్ళతో కలసి మెలసి ఉంటాడు.

## ఎర్రసైన్య నిర్మాణం

1928 జాన్యువరిలో హునాన్ లో తిరుగుబాటు వచ్చింది. ప్రప్రథమంగా ఛూ-టే సైన్యానికి రైతు కార్మిక విప్లవ సైన్యం, అని పేరు పెట్టారు. ఆ నాడే మొట్టమొదటి సారిగా సుత్తి, కొడవలి, నక్షత్రం పెట్టిన ఎరజండాతో బయలుదేరారు. ఈసైన్యాన్ని దక్షణయూనాన్ రాష్ట్రం తిరుగుబాటు రోజుల్లో ఉపయోగించారు. 1228 మే నెలలో చాంగ్ పాన్ వెళ్ళి 10 వేల సైనికులను నిర్మించాడు. దానిని వీరి మొదటి స్థావరంగా ఏర్పాటు చేసుకున్నారుకూడా. ఇచ్చట నే ఛూటేకు మోసేటుంగుతో పరిచయం కలిగింది.

1928 లో చాంగ్షాలో మావు ఛూటే సైన్యాలు కలిపివేయబడి కుమింటాంగు సైన్యంగా నిర్మించబడింది. దానికి కమాండరు ఛూటే. రాజకీయ కమిస్సారుగా మాసేటుంగు ఏర్పరచబడ్డారు. చాంగ్షాలో 6 మాసములు మా - చూలు ఒక పర్వతం మీద నేవున్నారు. శత్రువుని ఎదిరించి విజయం సాధించారు. 1929 నుండి ఎర్ర సైన్యంలో ప్రముఖపాత్ర వహించాడు ఛూటే.

జింగ్ కైషేక్ ఎప్పుడైతే పెట్టుబడిదారులతో కలసి కమ్యూనిస్టులను దారుణ హత్యలకు గురిచేయడం సాగించాడో అప్పుడే చూ, మా. మొదలగు నాయకులు ఆతనినుంచి వేరయ్యారు. స్వతంత్రంగా సోవియట్ల నిర్మాణానికి పూనుకున్నారు. 380,000 ప్రజలశక్తితోనూ ఎర్రసైన్యంతోను హనాన్, కియాంగ్సిలిలో సోవియట్లను స్థాపించారు. అమెరికా డబ్బితోనూ ఆయుధాలతోనూ నాజీజర్మనీచే ట్రెయినింగ్ పొందిన పదిలక్షలసైన్యంతో ఈ సోవియట్లపై ఛియాంగ్ దాడిచేశాడు.

అత్యంత లాఘవంగా మావు రాజకీయ ఎత్తుగడలతోను, చూటే సైనకనిపుణత్వంతోను కుమింగుటాంగు సైన్యాలు బిగించిన దిగ్బంధనుండి బయట పడి 80000 వేల మైళ్ళ దీర్ఘయాత్ర (1935) సాగించి ఉత్తరషాన్సీ రాష్ట్రంలోని ఎనాన్ లో సోవియట్ కేంద్రం స్థాపించారు.

ఈ నాయకులిద్దరను సామాన్యంగా చీనాప్రజాసామాన్యం మా. చూ. అని పిలుస్తారు, యిద్దరూ కలసి ఒకేవ్యక్తి అని వారి భావం మావు శాంతంగా, రాజకీయంగా ఆలోచించి ఎత్తుగడలు వేయు

మెదడనీ, ఛూ టేను. హృదయమనీ భావిస్తారు. అదేకాక ఏ ప్రకటన చూచినా మాసీటంగు-ఛూటేలని లేని ప్రకటన ఒకటి కూడా ఉండదు వీరిరువురిలోను ఎంతో గట్టితనం ఐక్యత కనపడుతుంది.

ఛూటె అందరిచేత గౌరవింపబడ తాడు. ఈయన సాధారణ రైతు జీవితాన్ని గడుపుతాడు. చిన్న, పెద్ద, అన్ని పోరాటాల్లోకూడా స్వయంగా పాల్గొంటాడు. సన్నాహాలు చేస్తాడు. ప్రజల్ని ప్రేమించుతాడు, ప్రేమించబడతాడు. మామూలు సైనికుడు చేసే పనులన్నీ చేస్తాడు.

1927 లో యీయన ఒక్క బాడీ గార్డుతో చిన్న యింట్లో ఉన్నాడు. యీయనను పట్టుకోవాలని కుమింగు టాంగు సైన్యాలు వచ్చి ముట్టడివేశాయి. ఈ ఛూటే యిక్కడలేడు. అలావెళ్లండి! మీరు వెళ్లితే కనబడతారు నేను ఆయనకు వంటచేసేవాడినని చెప్పి తప్పించుకున్నాడు. అప్పటినుండీ ఛూటేను సరదాగా వంట వాడని పిలుస్తారు.

1937 లో జపాను చైనామీద దాడి సాగించింది. ఛూటే తన శక్తినంతటిని వినియోగించి ఎర్రసైన్యాన్ని 8వ సైన్యంగా నిర్మించి పింగ్ షింగ్ కువాన్ వద్ద ప్రథమ విజయాన్ని సాధించాడు. జపాను సైన్యాల వెనుక ఛూటే, సహచరులు ఎర్రసైన్యంకూడా 90 లక్షల విముక్త ప్రదేశంలోనూ, ఇతరభాగాలలో కూడా జపానును ఎదిరించి చైనా స్వాతంత్ర్యాన్ని కాపాడాలని రైతుల్లో తీవ్ర ప్రచారం సాగించారు.

మంచి ఎత్తుగడలు, నిపుణత గలిగిన మావునూ, ఛూటేనూ, అనేక సమస్యలు ఎదుర్కొన్నాయి. జపానుపై యుద్ధంలో విజయానంతరం ప్రజాస్వామికంతో నిండిన విముక్త ప్రదేశాలను, ఎర్ర సైన్యాన్ని రద్దు పరిస్తే కమ్యూనిస్టు పార్టీపై నిషేధం తొలగించుతానని జంగ్ కై షేక్ సగర్వంగా ప్రకటించాడు.

అమెరికానుండి జపాను యుద్ధ సమయంలో పొందిన 4,600,000,000 డాలర్ల ధనం, ఆయుధాలు డబ్బుతో జులై 1946 లో 4300,000 సైన్యంతో కమ్యూనిస్టులను మూడు మాసాలలో తుడిచి పార వేస్తానంటూ యుద్ధం ప్రారంభించాడు జంగ్-కై-షేక్.

ఛూటే ఏనాన్‌లో ఉండేవాడు. సాధారణమైన బట్టలు, గుడ్డచెప్పులు తొడుగుకుంటాడు. ఏది వచ్చినా మంచి కొరకే అనే తత్వవేత్తధోరణిలో ఉన్నట్టు కనిపించుతాడు.

జంగ్ సైన్యాలు అన్నిరంగాలనుండీ విజయగర్వంతో వస్తుంటే ఛూటే ఆయన సహచరులు గెరిల్లాయుద్ధంతో తప్పుకుంటూ పనిచేస్తూఉండేవారు. "కొద్ది నెలలలోనె గొప్పమార్పు జరుగబోతుంది. జంగ్ విపరీతమైన నష్టాలలోపడి తీరుతాడు" అంటూ ధృడవిశ్వాసంతోను శాంతంగాను అనేవాడు ఛూటే. అంత ర్యుద్ధం మొదటిసంవత్సరంలోనే జంగ్ కై షేకు యొక్క ఆగులక్షలసైన్యం నష్ట పడింది. యింతాచేస్తే విముక్తి ప్రదేశాలలోని 141 పట్టణాలను మాత్రం పట్టుగోగలిగాడు. ఛూటేయొక్క విముక్తిసైన్యం అత్యద్భుతంగా తిరిగి దాడిచేసింది. తత్ఫలితంగా జంగ్ కైషేకు మంచి సైన్యాలను కున్నవన్నీ దెబ్బతిన్నాయి.

మలిటరీ కౌన్సిల్లో ఛూటే ప్రతిభా విశేషత కనుపిస్తుంది. ఈయనలో ఇంత ప్రతిభావిశేషాలుండుటకు కారణం ఆయ

నకు విప్లవశిక్షణ ఉండడమే. విప్లవనాయకుడు కావడమే కమ్యూనిస్టుపార్టీలో ఉండే నిర్మాణం శిక్షణ అంతమంచి వ్యక్తులను తయారు చేస్తుంది.

పార్టీకేంద్రం, మిలటరీ కేంద్రంయొక్క పరస్పర సంబంధాలు ధృఢంగా ఉండడం. కొన్ని ప్రదేశాలను విముక్తం గావించడం, వారి విప్లవఎత్తుగడలు, సరియైనవి అనే దృఢవిశ్వాసం ఉడడం, ముఖ్యంగా ప్రజల సహకారం సానుభూతి ఉండడం వారి విజయాలకు ప్రధానకారణం. వ్యవసాయ సంస్కరణల మూలకంగా నూటికి 80 మందికి భూవసతి కలిగింది.

జంగ్‌సైన్యంలో ఉన్నంతకాలం సైనికులు ధనవంతుల ధనానికి, ఆస్తికి కాపలాదారులుగా ఉండవలసి వచ్చేది. నేడో ఆయుధాలు క్రిందపెట్టి విముక్త ప్రదేశాలలోకి వచ్చినవారికి భూవసతి యిండ్లు దొరుకుతున్నాయి. వేలువందలు లక్షలు కుమింగుటాంగు సైన్యాలు ప్రజావిముక్త సైన్యాలతో కలసి, విముక్త చైనాప్రజల రక్షణకు నిలబడ్డాయి. మీరు యిన్ని విజయాలు సాధించుటకు కారణం ఏమిటని ఒక విలేఖరి ఛూతేను అడిగాడు. దానికి "ప్రజాసహకారమే" అని ఛూతే సమాధానం యిచ్చాడు.

విముక్తిసైన్యాల వెనుక ప్రజాసంఘాలు, ప్రజలు ఉన్నారు. స్త్రీలు యూనిఫారాలు కుట్టడం చెప్పులు చేనేత పని చేయడంతో పాటు గాయాలు తగిలిన సైనికులలకుకూడా సహకారం చేస్తున్నారు

ప్రజలు విముక్తి సైన్యాలకు రక్షణ యిచ్చేవారు. అన్ని సహాయాలు చేసేవారు. కాబట్టే కమ్యూనిస్టు సైన్యాలు దిగ్విజయంగా ముందుకు సాగాయి.

15 సంవత్సరాలక్రితం చైనా విముక్త సైన్యాలు దీర్ఘయాత్రలో వెనుకకుతగ్గాయి నేడు తద్వ్యతిరేకంగా ఎర్రజెండాతో దీర్ఘయాత్రలు జయప్రదంగా మా-చూల నాయకత్వాన సాగిస్తున్నారు. అమెరికా ఆయుధాలు, ధనం చీనా ప్రజాశక్తి ముందు, ఆగలేకపోయాయి.

ఎటువంటి నిరంకుశవిధానంగానీ, నిర్బంధాలుగానీ, మారణ ఆయుధాలుగానీ యాటంబాంబులుగానీ, ప్రజాశక్తిముందు ఎందుకూ పనికిరావని 47 కోట్ల చీనా ప్రజాసామాన్యం మరోసారిచాటిచెప్పింది. హిట్లర్, ముసోలినీ మొదలగు నరహంతకులకు ప్రజావ్యతిరేకులకు పట్టినగతే నేడు ఛియాంగ్‌కైషేక్‌కు, రేపు అతని అనుచరులకూ మిత్రులకూ పడుతుంది.

—"ఆనంద్"



అమెరికన్
డాలర్ను
చైనా రైతు
తంతుంటే
యిండియాలో
పడుతోంది

-క్రాస్‌రోడ్సునుండి



Edited, Printed & Published by G. Venkateswara Rao Guntur, Printed at Kavitilaka Press, Vijayawada.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA134M117 |
| పుస్తకం పేరు | జనత |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 75 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 43, 44 |
| తయారు చేసినది | Navya |
| పేజీలు విడదీసినది | Bhanu Sree |
| స్కాన్ చేసినది | Sri Ramya |
| పరీక్ష చేసినది | RUKSANA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |